17.11.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:44 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## స్థలం లేదు, ప్లాట్లు లేవు, అంతా మోసం!

# రియల్ ఎస్టేట్లు నెల్లూరీయుల కొంప ముంచాయి!

తమకంటూ ఒక స్వంత ఇంటి స్థలం సంపాదించు కోవాలని మధ్య తరగతి కుటుంబీకులు పడే తాపత్రయం రియల్ ఎస్టేట్ కంపెనీల పాలిట అమృత తుల్యంగా మారిపోయింది. ఒక్కసారి లక్షలు పోసి స్థలం



ముత్తుకూరు రోడ్డులో కేవలం బోర్డులు మాత్రం మిగిలిన పార్థసారథి రియల్ ఎస్టేట్ స్థలం!

కొనుక్కోలేక, స్వంత ఇంటి స్థలం పై మమకారం చంపుకోలేక వాయిదాల పద్ధతికి ఆశపడే వారి అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని కోట్లు కొల్లగొట్టి అదృశ్యమై పోతున్నారు కొందరు మోసగాళ్లు. కొన్ని రియల్ ఎస్టేట్ కంపెనీలు చేసిన మోసం, ఐదారేళ్లపాటు వారు చేస్తున్నది మోసమని తెలుసుకోలేని జనం తెలివి తక్కువ తనం గమనిస్తే ఆశ్చర్యం కలుగక మానదు.

రఘువీర్, మహావీర్ రియల్ ఎస్టేట్ స్కీంలలో ఐదేళ్లు నమ్మకంగా డబ్బు కట్టిన వారిప్పుడు అయోమయంలో పడిపోయారు; పార్థసారథి, అపోలో, ద్వారకామాయి తదితర రియల్ ఎస్టేట్ కంపెనీలలో సగం పైగా వాయిదాలు చెల్లించిన వారు వాటిని కొనసాగించాలో, ఆపేసి ఇప్పటికి కట్టించే పోయింది లెమ్మని సరిపెట్టుకోవాలో అర్థం కాక గందర గోళంలో పడిపోయి వున్నారు. ఈ పేర్లు చెప్పిన వాటికే ఈ మోసం పరిమితం కాలేదు - గత ఐదారేళ్లపాటు ప్రచారార్భాటంతో వచ్చిన కంపెనీల పరిస్థితంతా అదిగానే వుంది.

> మెగాస్టార్లమని గప్పాలు కొట్టిన వారు ముఖం చాటేసి అంగళ్లు మూసేశారు; కడుపు కట్టుకొని కూడబెట్టి నెలనెలా వాయిదాలు కట్టిన జనం మునిగిపోయారు!

నెల్లూరు టౌన్‌లో పది పన్నెండేళ్ల క్రితం రియల్ ఎస్టేట్ వ్యాపారం ప్రారంభమైంది. అప్పట్లో జిఎల్ నారాయణ, గంగాధర రెడ్డి వంటి ఒకరిద్దరు వాయిదాల పద్ధతిలో ఇండ్ల ప్లాట్లు అమ్మకం ప్రారంభించి ప్రాచుర్యంలోకి వచ్చారు. వారి ఉన్నతిని చూసిన తర్వాత రియల్ ఎస్టేట్ అనేది సులభంగా డబ్బు సంపాదించే కార్యక్రమమై పోయింది. లెక్కకు అందని కంపెనీలు పుట్టుకొచ్చాయి. అందమైన ప్రకటనలు చేశాయి. వూరికి అమిత దూరంలో కూడా ప్లాట్లు వేశారు

కొరవ 12 పేజీలో

# షేర్ మార్కెట్ కుప్ప కూలిపోయింది!

షేర్ మార్కెట్ తీవ్రమైన సంక్షోభంలో కూరుకు పోయింది. ఈ వారంలో బిఎస్ఇ షేర్ ఇండెక్స్ 300 పాయింట్ల వరకు పతనమైంది. ఇండెక్స్ గరిష్ట కేవలం 3170 పాయింట్ల దగ్గర ఆగిపోయి వుంది. కొత్త సెటిల్ మెంట్ ప్రారంభమైన తర్వాత ఇండెక్స్‌లో స్వల్పకాల కదలిక అయినా వుండడం సహజం. కానీ ఏడి ఐదేళ్లు అసాధారణంగా ధరలు పడి పోతున్నాయి. నిజానికి చాలా కంపెనీలు ఈ ఏడాది తమ వ్యాపారాలలో, లాభాలలో మంచి ప్రగతి సాధించాయి. ఆకర్షణీయమైన ఫలితాలు ప్రకటిస్తున్నాయి. కాని 30 శాతం అదనపు లాభం చూపించిన కంపెనీల ధరలు సైతం పడి పోవడం విచిత్రం.

ఈ ఆరు నెలల కాలంలో మోటారు వాహనాల అమ్మకాలు 25 శాతం పెరిగాయి. బజాజ్ ఆటో, హిందూస్థాన్ మోటార్స్, ప్రీమియర్ ఆటో కంపెనీలు మంచి ఫలితాలు ప్రకటించాయి. కాని వాటి షేర్ల ధరలు పడి పోతున్నాయి. టాటా టైయింగ్, టిస్కో, టెల్కో, హెచ్‌డిఎఫ్‌సిల ధరలు విపరీతంగా తగ్గాయి. ఎంతో ఆశా జనకమైన ఫలితాలు ప్రకటించిన మహీంద్రా, ఈస్ట్ ఇండియా హోటల్స్, చెట్టినాడ్ సిమెంట్స్, ఎల్అండ్‌టి, ఇండియన్ రేయాన్ షేర్ల గురించి అనుకునే వాడే లేడు.

పరిస్థితి ఇంత ఆందోళన కరంగా వుంటే, రిలయన్స్ కంపెనీ షేర్ల ట్రేడింగును బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజిలో 3 రోజుల పాటు సస్పెండ్ చేసి బిఎస్ఇ డైరెక్టర్లు పెద్ద పొరపాటు చేశారు. 18 లక్షల మంది షేర్ హోల్డర్లున్న పెద్ద కంపెనీ ఇది. కేవలం 10 వేల డూప్లికేట్ షేర్ సర్టిఫికెట్లు విడుదల చేశారన్న వివాదాన్ని సాకుగా చూపించి సస్పెన్షన్ వంటి తీవ్రమైన నిర్ణయం తీసుకున్నారు. రిలయన్స్ అధినేతలతో సత్సంబంధాలు లేని కొంత మంది డైరెక్టర్లు దుర్బుద్ధితో చేసిన నిర్ణయం ఇది. వీరు రిలయన్స్ షేర్లను పెద్ద ఎత్తున షార్ట్ సెల్లింగ్ చేసి వున్నారు. (షార్ట్ సెల్లింగ్ అంటే, షేర్లు లేకుండానే అమ్మడం; డెలివరీ సమయంలో మార్కెట్‌లో కొని ఇవ్వడం) రిలయన్స్ ధర రు. 220 ల ప్రాంతంలోకి పడిపోతే కాని వీరు లాభపడరు. అందువల్ల పనిగట్టుకొని ఆ షేరును ఇబ్బందుల పాల్జేస్తున్నారు.

షేర్ల ధరల రిగ్గింగ్, షార్ట్ సెల్లింగులు బొంబాయి, కలకత్తా, హైదరాబాదు స్టాక్ ఎక్స్ఛేంజిలలో విపరీతంగా జరిగి పోతున్నాయి. ఈ వారంలో హైదరాబాద్‌లో పాలిష

### డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

ఫైనాన్స్, అరిహెరస్ ఫైనాన్స్ కంపెనీల చరిత్ర చూస్తే ఈ మోసం అర్థమౌతుంది. అరి హరస్ కంపెనీ రెండున్నర కోట్లకు పబ్లిక్ ఇష్యూ విడుదల చేస్తే కేవలం 12 లక్షలు (5 శాతం) కట్టారు ఇన్వెస్టర్లు. మిగతా మొత్తమంతా ఒక ఫైనాన్స్ కంపెనీ పెట్టుబడి పెట్టింది. షేర్లు వారికే వెళ్లాయి. మొత్తం షేర్లు కొద్ది మంది చేతులలో ఇరుక్కోవడం వల్ల స్పెక్యులేషన్ సులభంగా చేయగలుగుతున్నారు. శ్రీనివాస షిప్పింగ్, శ్రీకృష్ణ డ్రగ్స్ కంపెనీల షేర్ల పై కూడా అటువంటి స్పెక్యులేషన్ జోరుగా వుంది.

షేర్లలో పెట్టుబడి పెట్టి, ఎట్లా బయట పడాలో తెలియక కుడితిలో పడిన ఎలుకలు వలె గిలగిల లాడుతున్న చిన్న ఇన్వెస్టర్లను పట్టించుకొనే వారే లేరు. ఈ షేర్ల మోసం ఇదే విధంగా మరి కొంత కాలం జరిగితే మార్కెట్ పై అందరికీ విశ్వాసం నశిస్తుంది. అదే జరిగితే కార్పొరేట్ రంగంలో పెట్టుబడి కొరత ఏర్పడి అనేక పరిశ్రమలు దెబ్బ తింటాయి. ఇప్పటికైనా రిగ్గింగ్ చేసేవాళ్లను అదుపులో పెట్టకపోతే చాలా ప్రమాదం.

## చంద్రబాబు పాలకోసం సర్కారు పాలకు క్షవరం

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు స్వంత కంపెనీ హెరిటేజ్ ఫుడ్స్ లిమిటెడ్ లాభాలు పెంచడం కోసం ప్రభుత్వ నిర్వహణలోని డైరీ సంస్థను పని గట్టుకొని నష్టాలలోకి నెడుతున్నారు. చంద్రబాబు నాయుడు గారు మొదట చిత్తూరు జిల్లాలో ఈ కంపెనీని ప్రారంభించారు. గ్రామాలలో పాలుకొని మద్రాసు, బెంగుళూరు నగరాలలో విక్రయించే వారు. ఆయన మంత్రి అయిన తర్వాత కంపెనీ బోర్డు నుంచి తాను తప్పుకొని, తన భార్య భువనేశ్వరీ దేవిని ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా నియమించారు. ప్రారంభించిన కొద్ది కాలంలోనే మంచి లాభాలు ఆర్జించింది ఈ కంపెనీ. పబ్లిక్ ఇష్యూ కూడా విడుదల చేశారు.

ఈ మధ్య కంపెనీ వ్యాపారం హైదరాబాదు, విశాఖ పట్టణం నగరాలకు కూడా విస్తరించింది. అయితే ఇక్కడ వారికి ఆశించినంత వ్యాపారం లభించలేదు. హైదరాబాదులో సర్కారు వారి డైరీ సంస్థ విస్తృతంగా వ్యాపించి వుండడమే దీనికి కారణం. ముఖ్యమంత్రి గారి కంపెనీకి నష్టాలు వస్తే అధికారులకు నిద్రెట్లా పడుతుంది చెప్పండి? తమ స్వామి భక్తిని ప్రదర్శించు కోవడానికి వారు డైరీ సంస్థ ఉత్పత్తి చేసే రు. 9.00 ల పాల ప్యాకెట్ల సంఖ్యను మూడున్నర లక్షల నుంచి మూడు లక్షలకు కత్తిరించారు. హెరిటేజ్ కంపెనీ విక్రయించే పాల ప్యాకెట్ ధర కూడా రు. 9.00 లే! డైరీ ప్యాకెట్లకు కరువు ఏర్పడడంతో, అదే ధరకు దొరికే ముఖ్యమంత్రి గారి పాల ప్యాకెట్లకు డిమాండ్ పెరిగి పోయింది. రోజుకు 50 వేల ప్యాకెట్ల అదనపు విక్రయం జోరుగా సాగుతున్న దిప్పుడు. అంటే చంద్రబాబుకు దినానికి నాలుగున్నర లక్షల అదనపు టర్నోవర్. ఏడాదికి 16 కోట్ల వ్యాపారం. ఒక్క సెంటర్‌లో ఇంత అదనపు వ్యాపారం జరిగితే ఆయన కంపెనీ ఎంత వృద్ధి చెందుతుందో ఆలోచించండి! అంత మేరా సర్కారు వారి డైరీ సంస్థకు క్షవరం జరిగి పోయిందన్న మాటే! రాజా తల్చుకొంటే కాని దేముంది? రాజకీయ నాయకుల దోపిడీకి గురి కాని దేముంటుంది?

## స్వర్ణలక్ష్మి స్వర్ణాభరణాల ఎర

అందమైన ప్రకటనలతో, ఆకర్షణీయమైన బహుమతుల ఎరవేసి చూపి జనాన్ని వశం చేసుకొనే వ్యాపార ప్రక్రియ నిరంతరాయంగా జరిగి పోతుంటుంది. ఎన్నిసార్లు నెత్తిన కుచ్చుల టోపీ పెట్టించుకున్నా జనంలో ఎప్పటి కప్పుడు ఆశ పీకులాడుతూనే వుంటుంది. తెలివైన వ్యాపారులు జనం తెలివి తక్కువ తనంతో డబ్బు చేసుకొంటూనే వుంటారు.

నెల్లూరులో ఇప్పుడిటు వంటి ఘరానా వ్యాపార సంస్థ ఒకటి జనం నెత్తిన పెట్టడానికి కుచ్చుల టోపీలు కుట్టే పనిలో బిజీగా వుంది. ఆ సంస్థ పేరు - స్వర్ణ లక్ష్మి ఫైనాన్షియర్స్. ఈ కంపెనీ ఎవరిదో, ఎవరెవరు ఇందులో భాగస్తులో తెలియదు. రాధా హాలు దగ్గర ఆఫీసు. వంద రూపాయలు డిపాజిట్ చేస్తే ఒక కిలో బంగారు ఇస్తారట. కరపత్రాల ద్వారా, కేబుల్ టివి ప్రకటనల ద్వారా హుదర గొడుతున్నారు. మొత్తం 2993 బహుమతులు; వాటి మొత్తం విలువ 21 లక్షలా 5 వేలు. కిలో బంగారు లేదా ఐదు లక్షల నగదు గల మొదటి బహుమతితో మొదలు పెట్టి, మారుతి కారు, 20 సవర్ల నగలు, సింగపూర్ టూర్, హీరోహోండా మోటారు సైకిల్, చేతక్ స్కూటర్, బంగారు గాజులు, కలర్‌టివి, ఫ్రిజ్, వాషింగ్ మెషిన్, సైకిళ్లు, స్టీలు క్యారియర్లు, ఇనుప కుర్చీలు, మంచినీళ్ల ఫ్లాస్కుల వరకు బజారులో దొరికే అన్ని వస్తువులనూ ప్రైజుల క్రింద చూపిస్తున్నారు. ఆ పాంప్లెట్ చూస్తే ఎవరికైనా వళ్లు పులుస్తాయి. అంత ఆకర్షణీయంగా వున్నాయా బహుమతులు. మాయా బజార్ సినిమాలో రమణా రెడ్డి సృష్టి వలెనే వున్నాయవి.

కానీ వీరి పథకం నిర్వహించాలంటే కనీసం 40 వేల మంది వంద రూపాయల లెక్కన డిపాజిట్ చేయాలి. బహుమతులకు 21 లక్షలు; డిపాజిట్లు బుక్ చేసే వారికి 25

కొరవ 11 పేజిలో

## కొత్త ఇష్యూలు

ఈ వారంలో కరూర్ కెసిపి ప్యాకింగ్స్, మార్వెల్ వినైల్స్, ప్రీయాక్స్ ఫార్మా కాస్మటిక్స్, అశోక్ మాగ్నటిక్స్ కంపెనీలు పబ్లిక్ ఇష్యూలు విడుదల చేయ బోతున్నాయి. కానీ వీటిలో ఏ ఒక్కదానికీ దరఖాస్తు చేయడం దండగే. ఏవీ చిన్న పెట్టుబడి దార్లకు వుపకరించేవి కావు.

### ఎం.ఎస్. ఇన్వెస్ట్‌మెంట్స్

అయితే, ఇదే వారంలో ఇష్యూకు రానున్న ఎంఎస్ ఇన్వెస్ట్ మెంట్స్ మాత్రం మంచి కంపెనీ. 1992 నుంచి ఫైనాన్స్ వ్యాపారం చేస్తున్నారు. గుజరాత్ రాష్ట్రానికి చెందిన నిర్వాహకులు ప్రమోటర్లు. ఈక్విటీలో వారి పెట్టుబడి శాతం 75 వరకు వుంది. అందులో 25 శాతం ఐదేళ్లు లాకిన్ పీరియడ్‌లో వుంటుంది. లీజింగ్, హైర్ పర్చేజ్ వీరి ప్రధాన కార్యకలాపం. కరూర్ వైశ్యా బ్యాంక్, స్టేట్ బ్యాంకులు ఈ కంపెనీకి అప్పులిచ్చి వున్నాయి.

కోటి 25 లక్షల ఇష్యూ; షేరు ధర రూ. 10 లు; దరఖాస్తు చేసిన వారికి నష్టం రాదు. లిస్టింగ్ అయిన పది రోజులలో అమ్మినా లాభమే. అందువల్ల నమ్మకంగా దరఖాస్తు చేయవచ్చు.

# విద్యుత్ శాపం

ఆంధ్ర రాష్ట్రం ప్రజలు ఏ జన్మలో చేసుకున్న పాపమో విద్యుత్ కొరత రూపంలో కట్టి కుడుపు తున్నది; అదొక శాపంగా పరిణమించి పీడిస్తున్నది. నవంబరు నెల రాష్ట్ర మంతటికీ వర్షాకాల మధ్యమ మాసం. తుఫాన్లు, వరదలు, అల్పపీడనలు, వెల్లువలు ముంచెత్తే సమయం. ఈ నెలలోనే విద్యుత్ కోత గురించి, కొరత గురించి హైదరాబాద్‌లో ప్రత్యేక సమావేశాలు జరుగు తున్నాయంటే, ముందున్న మునసర్ల వంతుగ ఎంత తీవ్రమైనదో అర్థం చేసుకోవచ్చు.

గృహావసరాలకు విద్యుత్ కోత ఎత్తి వేస్తున్నట్లు ముఖ్య మంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు ప్రకటించిన పక్షం రోజుల లోపలే మళ్లీ కోత విధించే పరిస్థితులు నెలకొనడం కంటే దురదృష్టకర పరిణామం ఇంకొకటి వుండదు. శ్రీశైలం, నాగార్జున సాగర్ ప్రాజెక్టులలో హైడల్ విద్యుత్ ఉత్పత్తి చేయడం సాధ్యం కాదని విద్యుత్ బోర్డు చేతు లెత్తేసింది. ఇప్పటి పరిమాణంలో కరెంట్ ఉత్పత్తి కొనసాగిస్తే, మార్చి నాటికి కృష్ణ డెల్టాకు సాగుకు నీరందివ్వడం అసాధ్యమని వారు తేల్చి చెప్పేశారు. రాష్ట్రం కరెంట్ అవసరాలలో సగభాగం తీర్చేది ఈ రెండు రిజర్వాయర్లే. కృష్ణ పరీవాహక ప్రదేశంలో వానలు సరిగా కురవక పోవడం వల్ల ఈ ఏడాది రిజర్వాయర్లకు అలస్యంగా నీరు చేరింది. ఫలితంగా కరెంట్ కోత కొనసాగించక తప్పలేదు. ఇప్పుడు కూడా పరిశ్రమలకు 40 శాతం కోత విధించి వున్నారు. పల్లెల్లో రోజుకు 9 గంటలకు మించి కరెంట్ సరఫరా జరగడం లేదు. కనీసం ఇళ్ల అవసరాలైనా తీర్చే స్థితిలో విద్యుత్ బోర్డు లేదు. శ్రీశైలం రిజర్వాయర్ నుంచి తెలుగు గంగ ద్వారా మద్రాసుకు మంచి నీళ్లు ఇవ్వ వలసిన అగత్యం ఏర్పడి వుంది. కాబట్టి, ఆ నీటిని క్రిందకు విడుదల చేసి కరెంట్ ఉత్పత్తి చేయలేరు. అక్కడ కనీస స్థాయి నీటి లెవల్ వుంచి తీరాలి. నాగార్జున సాగర్ పై కొన్ని లక్షల ఎకరాల వరి సాగు ఆధారపడి వుంది. కరెంట్ కోసం అ రిజర్వాయర్ ఖాళీ చేస్తే రైతులు అల్లాడి పోతారు. ధాన్యం దిగుబడి పడి పోతుంది.

ఈ పరిస్థితులలో యథా ప్రకారం విద్యుత్ కోత విధించి, రాష్ట్రాన్ని చీకటిలో మ్రగ్గనివ్వడం తప్ప చేయ దగిందేమీ లేదని అధికారులు తేల్చి చెప్పారు. ఇప్పటి నుంచే కరెంట్ కోత విధిస్తే పార్లమెంట్ ఎన్నికల సమయానికి జనం చీపుర కట్ట లెత్తుకొని పైకి వస్తారేమోనని చంద్రబాబు భయం. కాని చేయ గల్గిందేమీ లేదు.

ఏడాది పొడుగునా వాలీ చాలని విద్యుత్ సరఫరాను భరించాల్సి వస్తే రాష్ట్రంలో పరిశ్రమ లేమైపోవాలి? వ్యవసాయం ఏమి కావాలి? చీకట్లో తారాడే బాధను జనం ఎట్లా భరించాలి? ఏమిటీ దురవస్థ? ఈ కష్టాలు ఈ రోజు వచ్చినవి కావు. పదిహేనేళ్ల క్రితమే ప్రారంభ మైనవి, కానీ ఇటు కాంగ్రెస్, అటు తెలుగు పాలకులు జనం పడే వర్ణింప నలివి కాని కడగండ్ల గురించి పట్టించుకున్న పాపాన పోలేదు. కేవలం హైడల్ విద్యుత్ పై అధార పడితే లాభం లేదు. థర్మల్ విద్యుత్ ఉత్పత్తి పెంచాలని నిపుణులు నెత్తీ నోరు బాదుకొని అరిచి చెప్తున్నా ఒక్క ముఖ్యమంత్రికీ చెవి కెక్కలేదు.

కొత్త ప్రాజెక్టులు కట్టే సామర్థ్యం తనకు లేదని విద్యుత్ సంస్థ ఏనాడో తేల్చి చెప్పేసింది. ప్రైవేటు విద్యుత్ కర్మాగారాలు స్థాపించాలన్న ప్రతిపాదన పుష్కర కాలం నాడే పరిశీలనకు వచ్చింది. ఏళ్లు గడిచి పోతున్నా, ముఖ్య మంత్రులు అరడజన్ మంది మారినా ఈ విషయంలో ఒక నిర్ణయానికి రాలేక పోవడమే ఈనాటి దుస్థితికి కారణం. విశాఖ పట్టణం, విజ్జేశ్వరం, ముద్దనూరు, కృష్ణా పట్నం విద్యుత్ కేంద్రాల నిర్మాణం పూర్తయి వుంటే రాష్ట్రంలో ఈనాడు కరెంట్ కరువు అన్న మాటే విన్పించి వుండేది కాదు. కాని వాటిలో ఏ ఒక్కటీ పూర్తి కాలేదు. కృష్ణా పట్నం అయితే ఎవరికి ఇవ్వాలన్న సందిగ్ధమే తేలలేదు.

విద్యుత్ ప్రాజెక్టులలో వేల కోట్ల పెట్టుబడి, ఆదాయం ఇమిడి వుండడంతో ప్రమోటర్ల నుంచి అలివైనంత గుంజాలనే ఉబలాటంతో పాలకులు ఆ ఫైళ్లను నాన వేస్తున్నారు; ప్రభుత్వంలో వుండే వాడు అంతంత డబ్బు తిని త్రేన్పుతుంటే తమ గతి ఏమిటన్న దుగ్ధతో ప్రతిపక్ష నాయకులు అరిచి, ఆగం చేసి ఆ నిర్ణయాలను మరింత భ్రష్టు పట్టిస్తున్నారు. అక్కడి వారు ఇక్కడకు, ఇక్కడి వారు అక్కడకు మన్నువ చెందినా పరిస్థితిలో మార్పు లేదు. రాజకీయ వాదుల ధనాశకు, ధన రాజకీయాలకు విద్యుత్ ప్రాజెక్టులు బలై పోవడంతో పాటు, ప్రజలూ కష్టాల పాలౌతున్నారు.

ఇంకా ఎంత కాలం, సాగాలీ దుర్మార్గ రాజకీయం? ఇంకా ఎన్నేళ్లు అనుభవించాలీ దుర్భర అంధకారం? ఎక్కడో ఒక దగ్గర ఈ దుస్థితికి ఫుల్‌స్టాప్ పెట్టవలసిన అవసరం లేదా? ఏడాది పొడవునా కరెంట్ కోత తప్పక పోతే పరిశ్రమలు మూలపడి పోతాయి. పరిశ్రమలు మూత పడితే నిరుద్యోగం పెచ్చరిల్లు తుంది; వాణిజ్య పన్నుల ఆదాయం తగ్గి రాష్ట్ర ఖజానా మరింత చిక్కి పోతుంది; అభివృద్ధి కుంటు పడుతుంది; కొత్త పరిశ్రమలు రాష్ట్రం సరిహద్దులు దాటి తరలి వెళ్లి పోతాయి; వ్యవసాయం దెబ్బతింటే ఆహార ధాన్యాల కొరత ఏర్పడుతుంది; దాని ప్రభావం వూహించడం అసాధ్యం!

రాజకీయ వాదులు - వారు ప్రభుత్వాధి నేతలు కాని, ప్రతిపక్ష నేతలు కాని - తక్షణం తమ స్వార్థ రాజకీయాలు ప్రక్కన బెట్టి కొత్త విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం ప్రారంభింప జేయాలి. యుద్ధ ప్రాతిపదిక మీద నిర్ణయాలు తీసుకొని, అమలు చేస్తే తప్ప రానున్న రోజులలో రాష్ట్రం అంధకార శాపం నుంచి విముక్తి పొందదు.

జమీన్‌రైతు

---

జమీన్‌రైతు

16.11.1945

సం: 0-1-6 పేజీలు:8

## జమీందారీలు పోవాలి

జవహర్‌లాల్ నెహ్రూ

"జమీందారీ పద్ధతి రద్దయి తీరవలసిందే. కాని ఉచిత పరిహారం ఇవ్వటం మంచిది. ఎంత యివ్వట మనేది జాతీయ ప్రభుత్వము నిర్ణయిస్తుంది. రైతుకు భారము కానంతగా మాత్రమే నిర్ణయ మౌతుంది.

తర్వాత చిక్కుల పాలయ్యే దానికన్న, యివ్వ దలచుకున్న నష్ట పరిహారమంతా ముందే ఇచ్చివేసి ఫైసలా చేసుకోవటం మంచి పద్ధతి.

## పల్లెటూళ్లు

వెంకటగిరి

8 తేది అజాద్ ఎమెన్స్యూర్స్ ఆర్గనైజ్డు అసోసి యేషన్ స్థాపన దినోత్సవం పెంకిపిల్ల సంపాదకులు పి. రాఘవ రావు గారి అధ్వర్యాన జరిగింది. గాలి వాన సంఘటన నటవారి సన్నివేశాలు ప్రదర్శించ బడినవి.

రాత్రి "పాతివ" నాటకం ప్రదర్శింప బడ్డది. దీనిలో నటించిన సుందర, సీతాదేవి గారలకు వెండి కప్పుల బహూకరించిరి. దీని ద్వారా లభ్యమైన ధనాన్ని తుఫాను నిధికి పంపుదురు.

రేబాల

"చెప్పరవచ్చునే పరులు సెప్పిననైన నిజెచ్చనైనయే మిచ్చినైన కానలకునేగిననైన"

చెప్పించామండి ఓరుగంటి ప్రభృతుల చేత. ఎవడు పట్టించు కొనేది? 1400 పుస్తకాలు తుప్పుబట్టి పోతున్నవి అలాపలా లేక పెద్ద పుణ్య ల్లారా! గ్రంథాలయం బెట్టించండయ్యా స్వామి!

లేగుంటపాడు

బెట్టి సుందర వేణమ్మ గారి

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

ఆదర పోషణ క్రింద జరుగు తుండిన హరికథ స్థానంలో, కామరెడుల బుర్ర కథతో ప్రజల బుద్ధులను, దేవాలయాన్ని మైల పరచారు. ఆమె పరార్థ చింతకు అంతరాయం. వెంకన్న సంప్రోక్షణ ఖర్చుకు ఆస్కారం - యివీ కామరెడుల కార్యకలాపాలు.

## నెల్లూరు ముచ్చట్లు

పెళ్ళాన్ని పొడిచి కోర్టుకొచ్చిన ధీరుడు

కలిచెడు మైకామైన్ వద్ద పత్తె చల్ల కొండడు 10.11.45 తేది

కొరవ 8 పేజీలో

---

# ఫోటో కార్డులతో చాలా మేలు!

భారత దేశంలోని పౌరులందరూ ఎన్నికల్లో ఓటు వేయాలంటే విధిగా గుర్తింపు కార్డులు కల్గి వుండాలని ఎన్నికల కమీషనర్ శేషన్ ప్రకటించి నప్పుడు పలువురు పలురకాలుగా వాఖ్యానించారు. ఈ గుర్తింపు కార్డునే బహుళ ప్రయోజన కార్డుగా చేయాలన్న మన రాష్ట్ర ప్రభుత్వపు సంకల్పం కూడా బాగుంది. దీనితో దొంగ ఓట్లు, నాలుగైదు చోట్ల ఓట్లు కలిగి వుండడం వంటివి తప్పి పోతాయి. నివాసం, కులం, ఆదాయం, సర్టిఫికెట్ల కై తరచూ రెవిన్యూ కార్యాలయాల చుట్టూ తిరగాల్సిన శ్రమ తగ్గుతుంది. తొలుత శేషన్ డిశంబరు 31 నాటికి ఈ కార్డులకు ఇవ్వలేని రాష్ట్రాలలో ఎన్నికలు జరపనని ప్రకటించారు. కాని ఎందువల్లో మనసు మార్చుకొని కార్డులు ఎన్నికలకు సంబంధం లేదంటున్నారు. ఈ ప్రకటన వల్ల ఒక మంచి పనికి ఆదిలోనే హంసపాదు తగిలి నట్లయింది.

నెల్లూరు -పి. విజయలక్ష్మి

## పివిని గోర్బచేవ్‌తో పోల్చడం తగదు

ఇటీవల ఒక ప్రముఖ బిజెపి నాయకుడు ప్రధాని పివి నరసింహ రావును గోర్బచేవ్‌తో పోల్చడం దురదృష్ట కరం. అనుప సంశెల్ఫ నుండి ప్రజలకు ప్రత్యామ్నాయ మార్గం చూపించలేక విఫల మయ్యాడు గోర్బచేవ్. ఆ పని చేసి వుంటే రష్యా పరిస్థితి మరో విధంగా వుండేది. ప్రపంచంలోనే ఆరితేరిన ప్రజాస్వామ్య దేశం భారత దేశం. పరిపాలన యంత్రాంగం పటిష్ఠంగా వుంది. ఆర్థిక విషయాలు మినహాయిస్తే మిగతా

(జనవాణి)

విషయాల్లో రాష్ట్రాలు సర్వ స్వతంత్రమైనవి. రక్షణ, విదేశీ వ్యవహారాల్లో ధీటైన దేశం మనది. పివి నరసింహా రావు విజ్ఞతను ప్రపంచ మంతా శ్లాఘిస్తున్నది. అటువంటి నాయకుడ్ని స్వల్ప వివాదాలతో ప్రజలను రెచ్చగొట్టి ఓట్లుగా మలచు కోవాలని చూసే పార్టీ నాయకుడు విమర్శించడం శోచనీయం.

నెల్లూరు -టి.వి. నారాయణ

## వైద్యులకు తగిన శాస్తి

గ్రామీణ ప్రాంతాల్లోని ప్రాథమిక ఆరోగ్య ఉప కేంద్రాల్లో పనిచేసే డాక్టర్లు వారానికి ఒక్కసారి కూడా డ్యూటీ చేయను రారు. డ్యూటీలకు సరిగా రాని డాక్టర్లకు త్వరలో ఉద్వాసన చెప్పనున్నట్లు రాష్ట్ర

కొరవ 11 పేజీలో

ఎందుకీ బూటకం?

# తూనికల తనిఖీ కోసం మార్కెట్‌లో కొత్త తక్కెడలు!

జిల్లాలోని తూనికల కొలత శాఖాధికారులు, వ్యాపారస్తులకు వుండే అక్రమ సంబంధాలు అందరికీ తెలిసినవే. కాని విమర్శలు మరీ ఎక్కువై నప్పుడు ప్రజల కళ్ల నీళ్లు తుడవ డానికి, తా 'బా' పని చేస్తున్నామని లియ చెప్పేంగ 'ఉకు 'తప్పు' కార్యక్రమా 'ల కప్పుడప్పుడు చేబరు తుంటార. అటువంటి కార్యక్రమమే 11 తేది ఎసి కూరగాయల మార్కెట్ ముందు ఆ శాఖాధి కారులు ఏర్పాటు చేసిన, తనిఖీ స్టాల్. ఆ రోజు తాము వస్తున్నట్లుగా ముందుగానే తమ అస్మదీయ వ్యాపారులకు చెప్పినట్లుంది. ఆ రోజు వాళ్లంతా కొత్త తక్కెడలు, మిలమిల మెరిసే తూకం రాళ్లతో దర్శన మిచ్చారు. మార్కెట్‌లోని తక్కెడలన్నీ ఒక్కసారిగా ఎందుకు కొత్తవిగా కళకళ లాడుతున్నాయోనని మెట్రాలజీ శాఖ డివిజన్ ఇన్స్‌పెక్టర్ మోహన్ రామయ్యకు తోచినట్లు లేదు. వారంలో మూడు రోజులు ఎసి కూరగాయల మార్కెట్ వద్ద, మిగిలిన మూడు రోజులు ట్రైకస్ రోడ్డులోని చేపల మార్కెట్ వద్ద ప్రత్యేకంగా స్టాల్స్ ఏర్పాటు చేసి అటువంటి చెకింగ్ కార్యక్రమాలు చేపడుతున్నట్లు చెప్పారు. ఇంత హంగామా చేసి స్టాలను ఏర్పాటు చేసినా

## నెల్లూరు సంగతులు

నిత్యం వే... మంది వచ్చే ఎసి కూరగాయల మార్కెట్ వద్ద కేవలం రోజు కేవలం 30 మంది వినియోగ దారులు మాత్రమే తిరిగి స్టాల్ వద్దకు వచ్చి తమ సరకులను మళ్లీ తూకం వేసుకొని సరి చూసుకొన్నారు. వారందరికీ ఒక్కరి మీద కేసు నమోదు కాలేదు. ఎసి మార్కెట్‌లో వ్యాపారులు తూకాల్లో కోసే జిమ్మిక్కులు, బయట బీరాలు పలుకుతూ కూర్చొన్న తూనికల కొలతల శాఖాధి కారుల ట్రిక్కులు తెలియనవి కావు.

### ధూమపాన వ్యతిరేక ఉద్యమం విజయం సాధిస్తుంది!

మాడరన్ స్కూల్ అధినేత, లయన్స్ క్లబ్ పర్యావరణ విభాగం ఛైర్మన్ వాకాటి విజయ కుమార్ రెడ్డి చేపట్టిన ధూమపాన వ్యతిరేక వుద్యమం లాలూకు భారీ ప్ర...్శన, బహిరంగ సభ విజయవంతమయ్యాయి. 14 తేది టౌన్‌లోని స్కూల్ పిల్లలంతా సిగరెట్లు తాగడం మానమని అమాయకమైన

కొరవ 10 పేజీలో

# అడిగినంత ఎరువులిస్తే కొరత ఎట్లా పుట్టుకొచ్చింది?

తాను ఆదేశిస్తే అన్ని పనులూ అధికారులు సక్రమంగా చేస్తారని ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ నమ్ముతుంటారు. కాని జిల్లాలోని సహకార సంఘాల అధ్యక్షులు, కార్యదర్శులు యూరియా పంపిణీలో తన ఆదేశాలను ప్రక్కన పెట్టి, కృత్రిమ కొరతను సృష్టించి గల్లు పట్టిస్తున్నారని ఆయనిప్పుడు మధన పడుతున్నారు. అధికారులు, అధ్యక్షుల మధ్య సమన్వయం కోసం 13 తేది కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులో ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడారు. సెప్టెంబరు, అక్టోబర్ మాసాల్లో జిల్లాకు అవసరమైన 9 వేల మెట్రిక్ టన్నుల యూరియాను సొసైటీలు, ప్రైవేట్ డీలర్లకు సరఫరా చేసినా కొరత సమస్య ఎందుకు ఉత్పన్నమైందో అర్థం కావడం లేదన్నా రాయన.

అందువల్లే ఈ నెలలో 2575 మెట్రిక్ టన్నుల యూరియాను మార్క్‌ఫెడ్ అధీనంలో వుంచి, కేవలం సొసైటీల ద్వారానే సరఫరా చేయాలని నిర్ణయించినట్లు చెప్పారు. ప్రైవేట్ డీలర్లకు యూరియాను కేటాయించడం వల్ల, రైతులు రెండు దగ్గర్లా చేస్తున్నందున కొరత ఏర్పడు తున్నట్లు సొసైటీ అధ్యక్షులు కలెక్టర్‌కు

## కలెక్టర్‌కు అర్థం కాని యూరియా మాయ!

విన్నవించారు. డెల్టా ఏరియాలో రైతులు ఇప్పటికే వరినాట్లు వేసారని, వారికి అధిక ప్రాధాన్యత ఇచ్చి యూరియా సప్లై చేయాలని, నాన్ డెల్టా ప్రాంతాల్లో అవసరాన్ని బట్టి యూరియాను గుర్తించిన వారికి ఇవ్వాలని సూచించారు. వ్యవసాయ అధికారులతో కుమ్మక్కై, యూరియానును మాత్రమే బ్లాక్ చేస్తున్న విషయం కలెక్టర్ గ్రహించ కుండా జాగ్రత్త పడ్డారు వారు. మాత్రం వెల్లడించ లేదు వాళ్లు. నెల్లూరు జిల్లాకు మామూలుగా అన్ని జిల్లాలలో వ్యవసాయ పనులన్నీ పూర్తి అయిన తర్వాత మొదలవుతాయి కాబట్టి రాష్ట్ర వ్యాపితంగా వుండే డిమాండ్, సప్లై ప్రభావం అంతగా వుండదు. కంపెనీల నుంచి జిల్లాకు కేటాయిస్తున్న కోటా యూరియా అదృశ్యం అవుతుందా లేదా అనే విషయం కలెక్టర్ విచారణ జరిపించాలి.



మ.రా.రా.శ్రీ. డాక్టర్ వి. శ్రీనివాసులురెడ్డి కుమార్తె సమత; పవన్ కుమార్‌ల వివాహం ఈ నెల 4 తేది నెల్లూరు టిటిడిలో జరిగింది.

## సణుగుడు

* సత్యసాయిబాబాకు చేతులెత్తి మొక్కాలి!
* జిల్లారాజకీయంలో యూత్ కాంగ్రెస్ పైత్యం!

సత్యసాయి బాబా పై నాకే మాత్రం గౌరవం లేదు; ఆయన మహిమల పై నమ్మకం లేదు; ఆయన్ని దేముడిగానే, దేముడికి సంబంధించిన ఆరాధ్య నీయుడుగానే నమస్కరించడానికి నాకు మనస్కరించదు; అందరు బాబాలు, అమ్మల వలెనే ఆయన్నూ ఒక ఆధ్యాత్మిక వ్యాపారిగా భావించే వాడిని నేను, జనం బలహీనతలను సొమ్ము చేసుకొనే తెలివైన కాషాయ ధారిగా పరిగణించే వాడ్ని; గాలిలో విబూది సృష్టించడం, మ్యాజిక్ చేసి బంగారు గొలుసులు బహూకరించడం వట్టి దగాకోరు తనంగా భావించేవాడ్ని; ఆ అభిప్రాయంలో ఇప్పటికీ మార్పులేదు. కాని ఆయన పట్ల మాత్రం అపరిమిత ఆరాధన భావం పెల్లుబుకు తున్నది; చేతులెత్తి దండం పెట్టాలన్పిస్తూంది; ఆయన మహిమాన్విత వ్యక్తిత్వాన్ని వేనోళ్ల పొగడా లన్పిస్తూంది.

అనంతపురం జిల్లా మంచి నీటి కరువు తీర్చడానికి సత్య సాయిబాబా చేసిన కృషి నిరుపమానం. నిజంగానే ఈ మహాకృత్యానికి మరొక వుపమానం దొరకను కాక దొరకదు. గాలిలో నుంచి విబూది సృష్టించినట్లు, పాతాళ భైరవి మాంత్రికుడు హాంఫట్ అన్న మంత్రం చదివి అసాధ్యాలు సుసాధ్యం చేసినట్లె వుందా పనితీరు. 19 వేలా 300 చదరపు కిలో మీటర్ల సువిశాల విస్తీర్ణం, 35 లక్షల మంది జనాభా. వెయిన్నీ

### డోలేంద్ర

ఇరవై గ్రామాలలో కన్ను మూసి కన్ను తెరిచేంతలో నీటి కరువు మటు మాయమై పోయింది. రాత్రికి రాత్రి జలాశయాలు నిర్మితమై పోయాయి; రెప్పపాటులో పెద్ద పెద్ద ఓవర్ హెడ్ ట్యాంకులు కళ్ల ముందు నిల్చాయి;

కొరవ 7 పేజీలో

ఓపిక, తీరిక రెండూ లేకుండా వ్రాసిన

# కళావాస్తవికత లేనికట్టు కథలు

"కథకు కాళ్లు లేవు; ముంతకు చెవుల్లేవు" సామెతలు ఆరోగ్య కరమైన ఆమెతలు. ఎందుకంటే - అవి అనుభవ సారాన్ని పిండి, వండినవి కాబట్టి - పై సామెతలో మొదటి వాక్యశకలం అధిక్షేపణ - కథలు సహజత్వానికి దగ్గరగా వుండాలని సూచన. రెండవ దానిలో అవహేళన ఇమిడి వుంది. ముంతకు చెవులు పెడితే వికారం. చెవులు లేక పోవడమే సహజం. అంటే - కల్పన మేర మీర కూడదు. ఊహ వాస్తవికతతో చెలిమి చెయ్యాలి; ఒక దానితో మరొకటి కలమెలిసి పోవాలి. అప్పుడు - కథ కళావాస్తవికతో కళ కళ లాడుతూ, పాఠకులను తాకి, తన్మయత్వాన్ని కలిగిస్తుంది.

డా. జయప్రద గారి కథలకు కాళ్లున్నాయి; కాని నడక నేర్వ లేకున్నాయి. "తొలి అడుగుల" తొట్రుపాటు తొలగి పోలేదు; మలి అడుగుల మెలిమి కన్పించటం లేదు. ఉన్నది ఉన్నట్లు చెప్పడం కళ కాదు. మరి కన్నది కన్నట్లు చూపాలి అంటే వస్తు దర్శన ప్రదర్శనలు రెండూ కళాన్వితం కావాలి.


గ్రంథసమీక్ష
భయం
కథల సంపుటి
రచయిత్రి
పోమిరెడ్డి జయప్రద
సమీక్షకుడు
పాకాల వెంకటకృష్ణయ్య
ప్రతులకు
వంశీ పబ్లికేషన్స్
వంశీ నర్సింగ్ హోం, ఇందిరాభవన్ రోడ్డు, నెల్లూరు - 524 001.
వెల.రూ. 45/-


స్త్రీల వైయక్తిక జీవన సమస్యల పట్ల రచయిత్రికి సానుభూతి దండిగా వుంది. అయిన దానికి కాని దానికి ఆడదాన్నే ఆడిపోసు కోవడం పరిపాటి. అరిటాకు ముల్లు సామ్యం అందరికీ తెలిసిందే. కాని రచయిత్రి ఈ సమస్యలను కథలుగా చిత్రించడంలో పూర్తిగా విఫల మయ్యారు. కేవలం పద్దులు రాసుకుంటూ పోతున్నట్లు - సంఘటనల కూర్పు కథ కానేరదు; ఆ కూర్పులో ఓ నేర్పు ఉండాలి. అదే చిత్రణ (Delineation) సాహిత్య పరిభాషలో దీన్నే శిల్పం అంటాం. ఏ సాహిత్య ప్రక్రియ అయినా సరే - దాని గొప్పతనం వస్తు స్వీకారంలో ఉండదు; నిస్తులంగా దాన్ని నిర్వహించే తీరులో ఉంటుంది. "కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బు బిళ్లా కాదేది కవిత కనర్హం" - అని శ్రీశ్రీ అనడంలో సాహిత్యంలో శిల్ప ప్రాధాన్యతను నొక్కి చెప్పడమే. అటువంటి శిల్ప సౌందర్యం ఈ కథలలో శూన్యం.

అబలల ఆర్తనాదాలు ఈనాటివా? క్రీస్తుకు పూర్వం ఉన్నాయి. క్రీస్తు తరంలోనూ ఉన్నాయి క్రీస్తు

కొరవ 11 పేజీలో

# క్రైస్తవ ఆస్తి తగాదాలు బాంబుల వరకు వచ్చాయి!

దేశంలోని బాబాలు, స్వాముల వెనుక పెద్ద పెద్ద హంతక ముఠాలు వుంటున్నట్లుగా సినిమాల్లో చూస్తుంటాం. అటువంటి ముఠాకు క్రిస్టియన్ మఠానికి సంబంధించిన మిషనరీలకు సంబంధం వున్నట్లు కావలి ఎబిఎం డిగ్రీ కళాశాల పై 15 తేది తెల్లవారు జామున పోలీసులు జరిపిన దాడిలో సినిమా ఫక్కీలో వెల్లడయ్యింది. ప్రొపర్టీ అసోసియేషన్ ఆఫ్ బాప్టిస్ట్ (పి.ఎ.బి.పి) ఆధ్వర్యంలో నడిచే ఎబిఎం కళాశాలలో బాంబులు తయారు చేస్తూ దొరికి పోయిన గుండెమనకల దివాకర్ ఆ కళాశాల కరస్పాండెంట్! సమావేశం ఆఫ్ బాప్టిస్ట్ చర్చిల అధ్యక్షునిగా ప్రస్తుతం కొనసాగుతున్న దేవదానం కుమారుడు. ఈ దాడిలో భాస్కర రావు, కృపారావు అనే ఇద్దర్ని పోలీసులు పట్టుకోగా దివాకర్, ప్రదీప్ కుమార్, ఐజాక్‌లు పరారయ్యారట. కళాశాలలో బాంబులు తయారు చేస్తున్న గదిలో సల్ఫర్ రెడ్ పాస్పేట్, పొటాష్, సీసపు ముక్కలు, గాజు ముక్కలు, దారాలు దొరికినట్లు సిఐ వాసుదేవ రెడ్డి చెప్పారు. సమావేశం ఆఫ్ తెలుగు బాప్టిస్ట్ సంఘం ఆధిపత్యం విషయమై దేవదానం, ప్రకాశం జిల్లాలోని యేసు రత్నం వర్గాల మధ్య గొడవ జరుగుతున్న విషయం తెలిసిందే! నెల్లూరు అమెరికన్ ఆస్పత్రిలో రేగిన గొడవ మూలంగా ఈ తగాదాలు మరింత పెద్దవైనాయి. ఈ తగాదాల వల్ల దేవదానం కుమారుడు దివాకర్ తమ ప్రత్యర్థులను హత మార్చడం కొరకు గాని, ఆత్మ రక్షణార్థం గాని బాంబుల తయారీ చేస్తుండ వచ్చుని పోలీస్ అభిప్రాయం. దివాకర్ పట్టుబడితే గాని పూర్తి సంగతులు తెల్పి చెప్పలే మంటున్నారు. ఎబిఎం కళాశాలలో బాంబులు తయారు చేస్తున్న విషయం ఎవరో ఆకాశ రామన్న కావలి వన్ టౌన్ ఎస్ఐ రాంబాబుకు ఫోన్ ద్వారా అర్ధరాత్రి తెలియ జేసారట. ఏది ఏమైనా కోట్లాది రూపాయల ఆస్తులున్న సంస్థ ఆధిపత్యం విషయమై జరుగుతున్న గొడవలు, ప్రత్యర్థులను హత మార్చేందుకు బాంబులు చేసే స్థాయికి చేరడం ప్రమాదరం. మిషనరీల పెద్దలను ఇక్కడి వాస్తవ విషయాలు తెలుసుకొని పరిస్థితులు చక్కదిద్దితే గాని సంస్థ పేరు ప్రఖ్యాతులు, పరువు గంగ పాలు కాకుండా మిగలవు.

**మత పెద్దలు ఈ దుర్మార్గాన్ని తక్షణం ఆపాలి!**

## కావలి మునిసిఫ్‌కువీడ్కోలు

కావలి ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మునిసిఫ్ శ్రీనివాస రాజు సబ్ జడ్జిగా పదోన్నతి పై అనకాపల్లి బదలీ అయిన సందర్భంగా కావలి బార్ అసోసియేషన్ ఇటీవల వీడ్కోలు సభ ఏర్పాటు చేసింది. శ్రీనివాస రాజు పనిచేసిన రెండు సంవత్సరాలు ఆయన వ్యవహార శైలిని పలువురు న్యాయ వాదులు ఈ సందర్భంగా కొనియాడారు. సబార్డినేట్ జడ్జి జి. శ్యామ్ ప్రసాద్, ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మునిసిఫ్ కృష్ణమోహన్, బార్ అసోసియేషన్ కార్యదర్శి ఎస్.డి. కలీమ్ అహ్మద్ రోజ్‌దార్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

జగదేవిపేట జక్కా కామేశ్వరమ్మ స్మారక వైద్యశాల భవనాన్ని ప్రారంభిస్తున్న జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిణి డాక్టర్ ఊర్మిలా రెడ్డి, ప్రక్కన జె.వి. రెడ్డి, జె.ఎస్. రెడ్డి వున్నారు.

# మెట్ట రైతులకు ఆయిల్ పాం తోట అద్భుతమైన వరం!

నెల్లూరు జిల్లాలో ఆయిల్ పామ్ సాగుకు లక్ష ఎకరాల అనువైన భూమిని గుర్తించినట్లు, ఇంకా మరో 50 వేల ఎకరాల్లో ఈ పంట సాగుకు అవకాశం వున్నట్లు ప్రముఖ ఆయిల్‌పామ్ శాస్త్రవేత్త డాక్టర్ పి. రత్నం చెప్పారు. మనుబోలు వద్ద సింహపురి అగ్రో ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారి ఆయిల్ పామ్ ఫ్యాక్టరీ శంకుస్థాపన సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో రైతులను ఉద్దేశించి మాట్లాడారు. ఆయిల్ పామ్ సాగు ద్వారా మెట్ట ప్రాంత రైతుల స్థితి గతులలో అనూహ్యమైన మార్పు రానున్నట్లు చెప్పారు. ఆయిల్ పాం వలె దీర్ఘ కాలంలో సంవత్సరానికి హెక్టారుకు 40 వేల మేరకు ఆదాయం వచ్చే పంట మరొకటి లేదని చెప్పారాయన. రాష్ట్ర ఆయిల్ పామ్ సంస్థ డైరక్టర్ ఎం. నారాయణ రావు

కొరవ 8 పేజీలో

# ఆర్‌టిసి బస్‌లకు రాత్రిపూట గూడూరుకు దారికన్పడడం లేదు!

గూడూరు ప్రయాణీకుల పట్ల ఆర్టీసి సిబ్బంది సవతి తల్లి ప్రేమ చూపించడంతో ప్రజలు పడరాని పాట్లు పడవలసి వస్తున్నది. నెల్లూరు నుంచి రాత్రి 8 గంటల పైన కొన్ని పరిమిత సర్వీసులే గూడూరు టౌన్‌లోకి వస్తాయి. మిగతా సర్వీసులు బైపాసు రోడ్డు గుండా తిరుపతికి వెళ్తా గూడూరు ఆర్టీసి బస్టాండుకు రావడమే మానివేసాయి. దీనివల్ల గూడూరు ప్రజలను రాత్రి సమయాల్లో చిల్లకూరు వద్ద బైపాస్ రోడ్డు పై దించి వేస్తున్నారు ఇటీవల తిరుపతి నుండి గూడూరుకు వస్తుండిన ఒక మహిళను ఆమె పిల్లలను కనికరం లేకుండా దింపి వేసిన కండక్టర్, డ్రైవర్ పై ఫిర్యాదు చేసినా ఎటువంటి చర్యా తీసుకోక పోవడం పట్ల సర్వత్రా విమర్శలు వినవస్తున్నాయి. తిరుపతి వైపు వెళ్లే బస్సు డ్రైవర్లు నాయుడు పేట రూట్‌లో రోడ్ల పై నుంచే హోటళ్లలో పెట్టే ఉచిత భోజనానికి ప్యాకెట్ మనీకి అలవాటు పడి గూడూరు స్టాపింగ్‌లో ఆగకుండా వెళ్తున్నట్లు తెలుస్తోంది. కొన్ని ఎక్స్‌ప్రెస్ బస్సుల్లో గూడూరుకు టిక్కెట్ లేదని నాయుడు పేట టిక్కెట్టుకు డబ్బులు వసూలు చేసి కూడా బస్టాండు వద్దకు రాక పోవడంతో ఇటీవల బస్సుల్లో తరచూ ఘర్షణలు తలెత్తు తున్నాయి. నెల్లూరు ఆర్టీసి రీజనల్ మేనేజర్ ఈ విషయమై చొరవ చూపించి రాత్రి వేళల్లో గూడూరు బస్టాండ్‌కు బస్సులు వచ్చి ఆగేలా చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

**జిల్లావార్తలు**

## రాపూరులో కడప నాటు సారా!

రాపూరులో నాటు సారా వ్యాపారం జోరుగా సాగుతూంది. ఎక్సైజ్ శాఖాధికారులు గ్రామ గ్రామానికి జీపులు వేసుకొని తిరగడమే గాని కళ్ల ముందు జరుగుతున్న వ్యాపారాన్ని కనిపెట్టలేని కబోదులుగా మారి వున్నారు. కడప జిల్లాలో తయారు చేసిన నాటు సారాను రాపూరుకు సూరు గిలో మాటన్న దూరంలోని చిట్వేల్ రోడ్డులోని పొదలను ప్రధాన కేంద్రంగా చేసుకొని వ్యాపారం చేస్తున్నారు. భారీ స్థాయిలో జరుగుతున్న ఈ వ్యవహారం పట్ల ఎక్సైజ్ శాఖాధి కారులు మామూళ్లు తీసుకొని చూసీ చూడనట్లుగా వ్యవహ రిస్తున్నట్లు ఆరోపణలు ఎక్కువగా వినవస్తున్నాయి.

## లేగుంటపాడులో నెహ్రూ జయంతి

భారతదేశ తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవం లేగుంట పాడు గ్రామంలో జరిగింది. డిసిసి కార్యదర్శి చేవూరు దేవకుమార్ రెడ్డి కాంగ్రెస్ పతాకాన్ని ఆవిష్కరించారు. విడిముసలి గోపాలరెడ్డి కవికోకిల దువ్వూరు రామిరెడ్డి కాంగ్రెస్ జెండా పై వ్రాసిన గేయాన్ని మధురంగా పాడి వినిపించారు. జెట్టి కృష్ణారెడ్డి అధ్యక్షతన జరిగిన సభలో కవి శివారెడ్డి, శేషురెడ్డి, వేమారెడ్డి జానకి రామిరెడ్డి, పుచ్చలపల్లి శ్రీనివాసులు రెడ్డి, జి. సురేష్ తదితరులు మాట్లాడారు.

కొరవ 8 పేజీలో

## నెల్లూరు గుచ్చెత్తులు

విశ్లేషకుడు

### శంకరాచార్యులు

పూజ్య కంచి కామకోటి పీఠాధి పతులు శ్రీ జయేంద్ర సరస్వతి స్వాములు



వారు, చిన్నస్వామి శ్రీ విజయేంద్ర సరస్వతి 19 తేది నెల్లూరు వస్తున్నారు. 23 తేది వరకు ఆంధ్రసభలో పూజా కార్యక్రమాలు నిర్వహించి భక్తులకు సందేశం ఇస్తారు. పురుషయుక్త హోమం, విష్ణుప్రీతి యాగం, కార్తీక దీప పూజలు జరుగుతాయి. కనక మహల్ ఎదురుగా ఆడిటర్ శ్రీ సర్వేపల్లి జగన్నాథ రావు ఇంటిలో బస చేస్తారు 23 తేది తిరుపతి వెళ్తారు.

### చంద్రబాబు ఆకస్మిక పర్యటన

ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు రేపు (18 తేది) ఉదయం నెల్లూరు వస్తున్నారు. అనుకోకుండా, ఆకస్మికంగా కుదిరిన కార్యక్రమం ఇది. పుట్టపర్తి నుంచి కుప్పం వెళ్తూ మార్గ మధ్యంలో ఒక అరగంట నెల్లూరులో గడుపుతారు. ఉదయం 11 గంటలకు పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో హెలికాప్టర్ దిగి, నేరుగా నారసింహా రెడ్డి, మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డిల ఇళ్లకు వెళ్లి, కొద్ది సేపు అధికార్లతో మాట్లాడి, అరగంట వ్యవధిలో మళ్లీ హెలికాప్టర్ ఎక్కి కుప్పం బయల్దేరుతారు వస్తుంది.

అరగంట ఆగినా, ఆరు రోజులు వుండినా ముఖ్యమంత్రి అంటే అధికార్లకు వెన్నులో వణుకు కదా? పరుగులు పెడుతూ ఏర్పాట్లు చేస్తున్నారు.

సిఎం గారి కాన్వాయ్‌ని మినీ బైపాస్ రోడ్డులో నడిపించే వారెవరైనా వుంటే బాగుంటుం దండి! ఆయన నడుములు కలుక్కు మంటేనైనా ఆ రోడ్డుకు మోక్షం వస్తుందేమో!

# కృత్రిమ పాదాలే కాదు, వికలాంగుల కళ్లలో మెరుపులు సృష్టించారు!

శ్రీనివాస పేటలోని పెళ్లకూరు ...యమ్మ కళ్యాణ మండపం ఒక వర్క్ షాపులా మారిపోయి వుంది. కుర్చీలు, టేబుల్ల స్థానే కృత్రిమ కాళ్లు, పాదాలు, సైకిళ్లు తయారు చేసే యంత్రాలలో నిండి పోయింది. జిల్లా చుట్టు ప్రక్కల నుండి తరలిచ్చిన వికలాంగుల్లో, తమలోని అవయవాల లోపం మటు మాయం అవుతున్నదన్న ఆనందం వారి విప్పారిన ముఖాల్లో కనపడింది. పెళ్లకూరు వసంత కుమార్ రెడ్డి - 14 తేది నుండి క్షణం తీరిక లేకుండా తాను కొత్తగా స్థాపించిన స్వచ్ఛంద సేవా సంస్థ సభల కార్యకర్తలతో కలసి శిబిర నిర్వహణకు అహరహం శ్రమిస్తున్నారు. జస్టిస్ అన్సారీ స్మారకార్థం ఏర్పాటు చేసిన ఈ శిబిరం బరువు బాధ్యతలు వసంత్ కుమార్ రెడ్డి నెత్తిన వేసుకొని పనిచేస్తున్నారు. కృత్రిమ పాదాలు తయారు చేయడంలో ప్రపంచంలో ప్రఖ్యాతి కలిగిన రాజ...లోని భగవాన్ మహావీర్ వికలాంగ్ సహాయత సమితి నుండి ప్రత్యేక బృందం తరలి వచ్చింది. అరవై ఏళ్లు పై పడిన డాక్టర్ శాతర్ ఈ బృందానికి నాయకుడు; సమితి గౌరవ కోశాధి కారి ధర్మ చంద్ వికలాంగులకు ఏ సైజుల్లో కృత్రిమ అవయవాలు తయారు చేయాలో కొలతలు తీసుకొంటున్నారు. 1975 లో ఏర్పాటు చేయబడిన ఈ సమితి ఇప్పటి వరకు 98, 860 మందికి కృత్రిమ పాదాలు, 37 వేల మందికి ఇతర పరికరాలు 64, 950 మందికి చేతి కర్రలు, 6,367 మందికి ట్రైసైకిళ్లు ఉచితంగా అందజేసిందట. వికలాంగులకు కృత్రిమ పాదాలు అమర్చడంతో పాటు, వుండేందుకు వసతి సౌకర్యం కల్పించి; తిరిగి వచ్చేందుకు టిక్కెట్టు కూడా సంస్థే భరించి పంపు తుందంటే ఆ సంస్థ ఎటువంటి పరోపకార సేవ చేస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. సంస్థ తయారు చేసే

#### అభినందనీయం

కృత్రిమ పాదాలు చూస్తే అబ్బుర పోవాల్సిందే. వీటితో వేగంగా నడవచ్చు, పరుగెత్త వచ్చు; చెట్లు కూడా ఎక్క కూర్చో వచ్చునంటున్నారు డాక్టర్ శాతర్. నెల్లూరు శిబిరం కోసం 12 లక్షల రూపాయల విలువ చేసే పరికరాలతో పాటు, 10 ట్రై సైకిళ్లు కూడా ఈ బృందం తమ వెంట తీసుకొచ్చింది. 9 మంది టెక్నీషియన్స్ ఈ బృందంలో ఇద్దరు వికలాంగులు వున్నారు. తమలోని అంగ వైకల్యాన్ని ఏ మాత్రం పట్టించుకోక తమ వంతు సేవగా కష్టపడి పని చేస్తున్నారు. సూపర్ వైజర్‌గా పనిచేస్తున్న దేవకీ నందన్‌కు రెండు చేతులూ లేవు. అయినా కాళ్లతోనే అన్ని వివరాలు వ్రాసి రికార్డుల్లో నిక్షిప్తం చేస్తాడు. ఎలక్ట్రిక్ షాక్‌తో చేతులు పోగొట్టు కొన్నాననే విషయం తాను ఎప్పుడో మరచి పోయినట్లు జమీన్‌రైతు ప్రతినిధితో చెప్పారాయన. సెప్టిక్ అయ్యి రెండు కాళ్లు పోగొట్టు కొన్న రామ్ నారాయణ కృత్రిమ అవయవాలు తయారు చేయడంలో ప్రస్తుతం నిపుణుడు. సంస్థ సహాయంతో కాళ్లు వేసుకొన్న కృతజ్ఞతతో సంస్థలోనే గత 8 ఏళ్లుగా పనిచేస్తున్నారు. ఇంకా ఈ బృందంలోని దేవకిషన్, అనీల్, పాండే, హరి నారాయణ్, రాజేంద్ర సింగ్, రాజేంద్ర కుమార్‌లలో సమాజానికి తమ వంతు సేవ చేస్తున్నామనే తపన అణువణువునా జీర్ణించుకొని పోయి వుంది. ఉద్యోగం చేస్తున్నామనే భావన లేకుండా నేను సైతం వికలాంగుల సేవకు చేతనైన సాయం చేస్తున్నా ననే భావన వారి చేష్టలలో ప్రస్ఫుట మవుతున్నది. 18 తేది వరకు కళ్యాణ మండపంలో జరిగే శిబిరానికి వయస్సుతో సంబంధం లేకుండా 500 మందికి పైగా వికలాంగులు తరలి వచ్చారు. తమలోని లోపాన్ని సరిదిద్దు కొని పోయేటప్పుడు వాళ్ల కళ్లలో కనపడిన ఆనందం నిర్వాహకులు ఎన్నడూ మరచిపోలేరు. ఒక మంచి కార్యక్రమానికి శ్రీకారం చుట్టి విజయవంతం చేసిన స్వర్గీయ జస్టిస్ అన్సారీ కుమార్తె ఫరీదా హుసేన్, శిబిరాన్ని విజయవంతం చేసిన శ్రామికుడు వసంత్ కుమార్ రెడ్డి అభినందనీయులు!

### జనార్ధనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి 25 తేది తిరుపతి మీదుగా వాకాడు వస్తారు, 26 తేది వెంకటగిరి; 27 తేది నెల్లూరు; 28 తిరిగి తిరుపతి మీదుగా హైదరాబాదు.

### న్యాయమూర్తి బదలీ

వైఎస్ఆర్ కేసు పై తీర్పు వెలువరించిన కొద్ది గంటల లోపే అడిసెల్ జిల్లా జడ్జి శ్రీ రామకృష్ణకు బదలీ పుత్తర్వులు అందాయి. ఆయన్ను తిరుపతికి బదలీ చేశారు.

కొరవ 7 పేజీలో

## సణుగుడు

(4 పేజీ కొరవ)

జరజర ప్రాకే పాముల వలె వేల కిలోమీటర్ల పొడుగు పైపు లైన్లు గ్రామ గ్రామంలో పరుచుకొని పోయాయి. ఆకాశం నుంచి దేవత లెవరో కుండలతో అమృతం కురిపించినట్లు, కొళాయిల్లో నుంచి జలజల నీళ్లు జనం బొల్లెల్లో పడుతున్నాయి. ఇది కల కాదు - నిజం; వైష్ణవ మాయ అసలే కాదు - మానవ ప్రయత్న విజయం.

గత సంవత్సరం ఇదే సమయంలో తన పుట్టిన రోజు నాడు సత్య సాయిబాబాకు రాయలసీమ దాహార్తి తీర్చాలనే సంకల్పం కల్గింది. ముందుగా తాముండే అనంతపురం గొంతు తడపాలను కున్నారు. అనుకున్నదే ఆలస్యం - పనులు మొదలై పోయాయి. చకా చకా పరుగులు పెట్టాయి; నిధులు ప్రవాహం వలె తరలి వచ్చాయి. కాంట్రాక్టర్లు పోటీలు పడి ముందుకు వచ్చారు; రాత్రింబవళ్లు తేడా లేకుండా పని జరిగింది. మొన్న జూలై నాటికి సగం గ్రామాలకు నీళ్లిచ్చారు; ఈ రోజు మొత్తం అనంతపురం జిల్లా గొంతు తడుపు తున్నారు. మొత్తం 35 లక్షల మంది జనాభాకు, రోజుకు కనీసం ఒక్కొక్కరికి 40 లీటర్ల చొప్పున కోటి 40 లక్షల నీరు సరఫరా అవుతుంది. భూమిలో నీరుంటే బోరు వేశారు; ప్రక్కన చిత్రావతో, తుంగభద్రో, పెన్నో వుంటే లిఫ్ట్ చేశారు, రెండూ లేకుంటే ఎక్కడి నుంచో నీరు తెచ్చి, ఇంకెక్కడో జలాశయం నిర్మించి మైళ్ల కొద్దీ పైపుల ద్వారా నీళ్లు నడిపి దాహార్తి తీర్చారు. ఈ పనులన్నీ సరిగ్గా ఒక్క ఒక సంవత్సరంలో, లెక్క పెట్టినట్లు 365 నట్లు రోగుల వ్యవధిలో పూర్తయి పోయాయి. రెండు వందలు కోట్ల డబ్బు సాయిబాబా అందజేశారు. అంతా కలలో వలె జరిగి పోయింది.

సాయిబాబా మాయలు చేసి, మ్యాజిక్‌లు చేసి, భ్రమలు సృష్టించి డబ్బు సంపాదించి వుండవచ్చు. దేశంలో చాలా మంది బాబాలు, అమ్మలు, స్వాముల వార్లు వందల వేల కోట్లు పలు రూపాలలో ఆర్జించారు. కాని వారెవ్వరూ సాయిబాబా వలె తమ ఆర్జనను జన కళ్యాణం కోసం వెచ్చించ లేదు. సాయిబాబాను నమ్మే వారు, నమ్మని వారు; ఆరాధించే వారు, ద్వేషించే వారు; దైవంగా పూజించే వారు, దగాకోరుగా గేలి చేసే వారు ముక్త కంఠంతో, ఒకే మాటతో పొగిడి తీర వలసిన విషయం ఆయనలోని సంకల్ప బలం. కేవలం తప్పిచ్చి సరిపెట్టుకొని వుంటే, ఏ పంచాయితీ రాజ్ ఇంజనీర్లో దాన్ని శుభ్రంగా దిగమింగి కరువును పదిలంగా పోషించి వుండేవారు. ఆశ్రమం నుంచి అడుగు బయట పెట్టకుండా, ఒక్క మాట మాట్లాడకుండా అంత పెద్ద పనిని సైనిక క్రమ శిక్షణతో జరిపించడం నిజంగా అబ్బురమే. ఇదే పని ప్రభుత్వం చేపట్టి వుంటే రెండు వేల కోట్ల నిధులు, ఇరవయ్యేళ్ల ప్రయాస పడి వుండినా పూర్తయ్యేది కాదని నమ్మకంగా చెప్పవచ్చు. పని చేసింది అదే ప్రభుత్వ కాంట్రాక్టర్లు అయినా వారిని ఏదో దివ్యశక్తి నడిపించినట్లు చెప్పిన సమయానికి పూర్తి చేయగలిగారు. సాయిబాబాలో మహిమలున్నాయో లేవో తెలియదు కాని, ఆయన చేసిన ఈ కృషి మాత్రం మహిమాన్వితమైంది.

ప్రభుత్వాన్ని నడిపే పాలకులు ఈ మహత్కార్య నిర్వహణ తీరు నుంచి గుణపాఠం నేర్చుకొంటే, అభివృద్ధి ఎంత వేగిరంగా జరుగుతుందో కదా!

* * *

జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ చిట్టమూరు ప్రవీణ్ కుమార్ రెడ్డి నియామకం జిల్లా కాంగ్రెస్ రాజకీయాలలో చాలా వివాదా స్పదంగా వుంది. ప్రవీణ్ కుమార్ రెడ్డి వివాదాలు సృష్టించగల, రచ్చలకు కారణ భూతుడు కాగల రాజకీయ వాది కాదు. కాంగ్రెస్ పార్టీలో అతని ప్రమేయం, పాత్ర ఏమీ లేవు. మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ఈ నియామకాన్ని తన రాజకీయ ప్రాభవ సంకేతంగా వాడుకోవడమే వివాదానికి దారి తీస్తోంది. జనార్ధన రెడ్డి అభీష్టానికి వ్యతిరేకంగా ఒక పార్టీ పదవి సాధించడం చాలా ఘనతర విజయమని వారు భావిస్తున్నారు. జనార్ధన రెడ్డిని కాదని 1978 తర్వాత ఎప్పుడూ ఎవరూ జిల్లాలో ఏ పదవి పొంద లేదని, అది తమకే సాధ్యమైందని తమ ఛాతీ తాము చరుచుకొని సంతోష పడ్తున్నారు. జనార్ధన రెడ్డి మాటే కాంగ్రెస్ మాటగా గత పదిహేనేళ్ల నుంచి చలామణిలో వున్న మాట నిజమే కాని, ఆయన్ని కాదని ఎవరూ పదవులు పొందలేక పోయారన్నది నిజం కాదు. నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి ద్వితీయ మంత్రిత్వం నుంచి, అంజయ్య హయాంలో పెళ్లకూరు మంత్రి నియుక్తు కావడం నుంచి, విద్యార్థి యువజన కాంగ్రెస్ రాజకీయాలలో శ్రీధర్ రెడ్డి, విజయ కుమార్ రెడ్డి వంటి పిల్లకాయలు నేరుగా పదవులు తెచ్చుకోవడం దగ్గర నుంచి, పువ్వులపల్లి పెంచలయ్య నెల్లూరు ఎమ్మెల్యే స్థానానికి టిక్కెట్ తెచ్చుకోవడం దగ్గర నుంచి, 1985 ఎన్నికల్లో అసెంబ్లీ అభ్యర్థులుగా అర్హులెందరో పోటీ చేయగలగడం నుంచి జిల్లాలో పలు మార్లు పలువురు కాంగ్రెసేయులు జనార్ధన రెడ్డి అభీష్టానికి వ్యతిరేకంగా విజయం సాధించడం మనం చూశాం. అది మర్చి పోయి, ఇప్పుడు దీన్నొక రాజకీయ గెలుపుగా భావించడం - నిన్న ఏమి జరిగిందో తెలియని రాజకీయ అమాయకత్వం గానే భావించాలి.

యూత్ కాంగ్రెస్ పెద్ద పదవి కాదు. పార్టీ అధికారంలో లేని రోజులలో అది మరీ గుర్తింపులేని అప్రధాన రాజకీయ హోదా! దాని కోసం సుబ్బరామ రెడ్డి గారు అంత ప్రయాస పడడం కూడా అనవసరమే. పది లకారాల వరకు తుప్ప వదిలి నట్లుంది. అప్పటికి పిసిసి కాని, రాష్ట్ర యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు కాని, జాతీయ అధ్యక్షుడు కాని తాము ఇరుక్కోకుండా జాగ్రత్త పడ్డారు. ఎవడో యుగరాజ్ బదూరియా అనే బడుద్ధాయి ఆర్డరు ఇచ్చాడు. ఆఫీసర్లకు తెలియకుండా గుమాస్తాలకు డబ్బిచ్చి దొంగ తనంగా కాగితం సృష్టించి నట్లుందిది. ఇంత చిన్న పదవికి అంత తాపత్రయ మెందుకు? కాగితం చేతికి వచ్చినా ఖర్చుకు ముగింపు పడినట్లు లేదు. పిసిసి అధ్యక్షుడు హైదరాబాదులో కడుతున్న ఇంటికి రెండు లారీల ఇనుప కమ్ములు నెల్లూరు నుంచి నిన్ననే బయల్దేరి వెళ్లాయట. నాటు భాషలో చెప్పాలంటే 'బిల' అనుకోవాల్సిందే!

యూత్ కాంగ్రెస్ కాగితం చేతికి వచ్చినంత మాత్రాన జనార్ధన రెడ్డిని రాజకీయంగా హతమార్చినట్లు లెక్కా? ఇదే స్పిరిట్‌లో డిసిసి అధ్యక్షుడ్ని మార్పించి, నెల్లూరు ఎమ్పీ సీటుకు తాము సూచించే ఒక ఐఎఎస్ అధికారికి టిక్కెట్ ఇప్పించ బోతున్నామని ప్రచారం జరుగుతున్నది. ఎంత అమాయకత్వం?

* * *

నెల్లూరులో జనార్ధన రెడ్డిని రాజకీయంగా ఖతం చేస్తామని బీరాలు పల్కి, జనాన్ని రెచ్చగొట్టి సుబ్బరామ రెడ్డి గారు హైదరాబాదులో అదే జనార్ధన రెడ్డి ఇంట రెగ్యులర్‌గా అటెండెన్స్ వేసుకోవడం పెద్దింటి పోకడలని సరిపెట్టు కోవాలేమో! ఎన్టీఆర్, ఎఎన్ఆర్ అభిమానుల పేరిట పాత రోజుల్లో కుర్రకుంకలు వాల్‌పోస్టర్ల పై పేడ చల్లుకొంటూ, వీధుల్లో తన్ను కొంటుంటే -మద్రాసులో ఆ నటులిద్దరూ కులాసాగా విందులు, వినోదాలలో పాల్గొనేవారు. ఆ కోవలోనే వుంది పరిస్థితి. నమ్మి వర్గ నిబద్ధతతో నిలబడే వారే బడుద్ధాయిలు.

* * *

ప్రవీణ్ కుమార్ రెడ్డికి రాజకీయాలు కొత్త. తాను తొమ్మిదేళ్ల ప్రాయంలో జై ఆంధ్ర ఉద్యమంలో వీరోచితంగా పోరాడి; పదమూడేళ్ల చిరుత వయస్సులో కాంగ్రెస్ అభివృద్ధికి విశేషంగా కృషి చేసి; మాగుంట సుబ్బరామ రెడ్డి గారితో కలిసి జిల్లాలో 1990 నుంచి (అప్పటికి పాపం సుబ్బరామ రెడ్డి గారికి రాజకీయాలంటే ఏమిటో తెలియదు, వ్యాపారం తప్ప) కాంగ్రెస్‌ను తీర్చిదిద్దానని తన 'జీవిత సంగ్రహం' లో చెప్పుకొన్నప్పటికీ ప్రవీణ్ రాజకీయం ప్రారంభం కానున్నది ఇప్పుడే! రక్తం ఉడుకు దుకుగా వుంది; మాగుంట అండ వుంది; డబ్బుకు చింత లేదు; విద్యాధికుడు కాబట్టి చొరవ చూపగలడు. వర్గతత్వంతో అందరితో కొని తగువులు తెచ్చుకోకుండా, తన స్థాయిలో సంయమనంతో ప్రవర్తించ గల్గితే మంచి భవిష్యత్ వుంటుందని ఆశిద్దాం!

నిక్కరు వేసుకొని బడిలో పాఠాలు చదువుకొనే వయస్సులో వీరోచిత రాజకీయ పోరాటాలు చేసినట్లు ప్రచారం చేసుకోవడం వంటి ప్రాకులాటలు ఎందుకు? దానివల్ల ఏమి వుపయోగం?

## నెల్లూరుముచ్చట్లు

6 పేజీ కొరవ

### కేబుల్ టివిల బంద్

పన్ను విధింపుకు నిరసనగా కేబుల్ టివి యాజమాన్యాలు సమ్మె ప్రకటించడంతో టివిలు మూగబోయి వున్నాయి. రాత్రింబవళ్లు సినిమా పాటలు, సినిమాలతో హోరెత్తి పోతుండిన ఇళ్లలో నిశ్శబ్దం రాజ్యం చేస్తున్నది. కేబుల్ కాలక్షేపానికి అలవాటు పడిన వారు చాలా ఇబ్బంది పడుతున్నారు. మళ్లీ టివిలో రణగొణ ధ్వనులు ఎప్పుడు ప్రారంభ మౌతాయో చెప్పలేకున్నారు.

కేబుల్ టివి కార్యక్రమాలు ఎంతటి వ్యసనంగా మారి జనాన్ని బానిసలుగా మార్చు కున్నాయో ఇప్పుడు అర్థం అవుతుంది.

### వైఎస్ఆర్ బయటపడ్డాడు

రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి చెన్నూరు జంట హత్యల కేసు నుంచి 'దోషిగా' బయట పడ్డారు. 1989 మే 17 తేది ఆయన స్వగ్రామం చెన్నూరులో రెండు హత్యలు జరిగాయి. అప్పటి కాయన అధికార తెలుగు దేశం నాయకుడై నప్పటికీ హత్యా సన్నివేశంలో దొరకడం వల్ల పోలీసు కేసు పెట్టవలసి వచ్చింది. ఈ ఆరేళ్లుగా ఆ కేసు విచారణ జరుగుతూనే వచ్చింది. కేసులో ప్రధాన సాక్షి, హతుడి సమీప బంధువు ప్రాసిక్యూషన్‌కు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడంతో కేసు పెద్ద మలుపు తిరిగింది. వైఎస్ఆర్‌ను అదే రక్షించి నట్లుంది.

అయితే కేసులోని మరో నలుగురు నిందితులను దోషులుగా నిర్ధారించి, యావజ్జీవిత ఖైదు విధించారు అడిషనల్ జిల్లా జడ్జి శ్రీ వై.వి. రామకృష్ణ. 17 మందిని నిర్దోషులుగా విడుదల చేశారు. వైఎస్ఆర్ వర్గం తమ పై నడిచే కేసుకు ప్రతిగా తమ ప్రత్యర్థుల పై దాఖలు చేసిన కౌంటర్ కేసులో జానా నారయ్య అనే నిందితుడికి ఆరేళ్ళ శిక్ష; అల్లూరు పిచ్చిరెడ్డికి ఏడాదిఖైదు; జానా శ్రీనివాసులకు ఆరు నెలల శిక్ష విధించారు. ఇదే కేసులోని 32 మందిని నిర్దోషులుగా భావించి వదిలేశారు.

ఎల్లసిరి వర్గానికి చెందిన జి. రాజేశ్వర రెడ్డి, అల్లూరు శంకర రెడ్డి, యు. శ్రీనివాసులు రెడ్డి, జి. రమణయ్యలకు జీవిత ఖైదు పడింది.

* * *

ఎల్లసిరికి ఇది రాజకీయ పునర్జన్మ. ఈ కేసులో ముద్దాయిగా నిర్ధారింపబడి వుంటే ఆయన రాజకీయ సన్యాసం స్వీకరించాల్సి వచ్చేది. కేసు తుది విచారణకు వచ్చేసరికి ఎమ్మెల్యే కావడం ఆయన అదృష్టం. పోలీసు శాఖ ఆయనకు మంచి రక్షణే కల్పించింది.

## జిల్లావార్తలు

5 పేజీ కొరవ

### కావలి ఎబిఎం కళాశాలలో 9 నెలలుగా జీతాలు లేవు

గత 9 నెలలుగా తమకు జీతాలు ఇవ్వడం లేదని, వెంటనే చెల్లించాలని కావలి ఎ.బి.ఎం. డిగ్రీ కళాశాల సిబ్బంది 13 తేది నుండి సమ్మె ప్రారంభించారు. మైనారిటీ సంస్థ పేరుతో 5 సంవత్సరాల క్రితం ప్రారంభించిన ఎబిఎం డిగ్రీ కళాశాలకు ప్రభుత్వ గుర్తింపు లభిస్తుందని చెప్పి, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బంది నుండి భారీగా నిధులు వసూలు చేసి వుద్యోగాలు ఇచ్చింది యాజమాన్యం. కాని ఇంత వరకు ప్రభుత్వ గుర్తింపు లభించక పోవడంతో తాము చిక్కుల్లో పడ్డామని విదానంగా గుర్తించారు. అయితే కావలిలో వున్న ఏకైక డిగ్రీ కళాశాల జవహర్ భారతిలో గత సంవత్సరం సీట్లు రాని విద్యార్థులు ఎబిఎం డిగ్రీ కళాశాలలో చేరడంతో గత సంవత్సరం నుండి ఇక్కడ కూడా రద్దీ పెరిగి పోయింది. ఇదే మంచి ఛాన్సుగా కళాశాల యాజమాన్యం విద్యార్థుల నుండి అధిక మొత్తంలో ఫీజు వసూలు చేసి తమ ఖాతాలో జమ చేసుకొన్నది. వసూలు చేసిన ఫీజుల్లో కొంత మేరకు ఇచ్చినా తమ జీతాలకు సరి పోతుందని సిబ్బంది వాదన. 9 నెలలు జీతాలు ఇస్తే గాని సమ్మె మానమంటున్నారు.

## శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము

దర్గామిట్ట - నెల్లూరు - 4. ఫోన్: 22016

### వేలం ప్రకటన

నెల్లూరు జిల్లా, నెల్లూరు టౌన్, దర్గామిట్టలో వేంచేసివున్న శ్రీరాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము గాలి గోపురం ముందు భాగములో కొబ్బరి కాయలు మరియు పూజా ద్రవ్యములు అమ్ముకొను హక్కులకై 26.11.94 తేది ఆదివారం సాయంత్రం 6.00 గంటలకు సదరు ఆలయ కార్యాలయం వద్ద ఎండోమెంట్సు వారి సమక్షములో బహిరంగ వేలం పాట జరుపబడును.

### పాట షరతులు

1. ఈ పాట హిందూ దేవాదాయ -ధర్మాదాయ శాఖ అధికారి వారి మంజూరు ఉత్తర్వులకు లోబడి వుండును.
2. ఏ కారణము తెలుపకయే పాట నిలుపటకు, వాయిదా వేయుటకు ధర్మకర్తల మండలి ఛేర్మన్ వారికి అధికారము కలదు.
3. పాట కాలము 10.12.95 తేది నుండి 9.12.96 తేది వరకు అనగా ఒక్క సంవత్సరము మాత్రమే కాలపరిమితి ముగిసిన వెంటనే వేరే నోటీసుతో నిమిత్తము లేకుండా పాట కాలపరిమితి పూర్తిగా అగునట్లు నిర్ణయం.
4. పాటలో పాల్గొను వారు ప్రథమ ధరావత్తు రు. 5000/- లు ముందుగా చెల్లించి పాటలో పాల్గొన వలెను.
5. ఏ కారణం తెలుపకనే ఏ వ్యక్తినైనను పాటలో పాల్గొనకుండా నిలుపదల చేయుటకు ధర్మకర్తల మండలి ఛేర్మన్ వారికి అధికారము కలదు.
6. అంగీకరించబడిన హెచ్చు పాటదారుడు పాట ముగిసిన వెంటనే పాట మొత్తములో 1/3వంతు చెల్లించ వలయును. మిగిలిన మొత్తం పైకము 10.12.95 తేదిన చెల్లించి రశీదు పొందిన మీదటనే అంగడి పెట్టుకొన వలెను.
7. హెచ్చు పాటదారు ధర్మకర్తల మండలి నియమములకు బాధ్యుడై వుండవలెను. కొబ్బరి కాయలు - పూజా ద్రవ్యములు ఆలయ కొట్టునందే అమ్ముకొన వలయును.
8. హెచ్చు పాట ఆమోదించబడిన పాట దారు మాత్రమే పై వ్యాపారము చేసుకొన వలయును. ఇతరులకు సబ్ లీజుకు ఇవ్వకూడదు. అట్లు ఇచ్చిన యెడల వేరే నోటీసుతో నిమిత్తం లేకుండా వారి పాట రద్దు పరచబడి చెల్లించిన మొత్తము పైకము దేవస్థానమునకు అపరాధము క్రింద జమకట్టు కొనుబడి తిరిగి వేలం పెట్టబడును. వేలంలో రాబడే నష్టమును హెచ్చు పాటదారు నుండి రాబట్టుకొనే నిర్ణయం.
9. పాట ముగిసిన వెంటనే పాటదారుని ధరావత్తు మినహాయించి మిగిలిన వారి ధరావత్తులు వెంటనే వాపసు యిచ్చి వేయబడును.
10. మిగిలిన విషయములు ఆలయ కార్యాలయము పని చేయు వేళలలో వచ్చి తెలిసికొన వచ్చును.
11. పై షరతులు ఒప్పుకొన్న వారే పాటలో పాల్గొన వలెను.

గమనిక: శ్రీ అమ్మవారి మొక్కుబడులుగా వచ్చిన చీరలు, రవికలు ప్రతి శుక్రవారం సాయంత్రం 6 గంటలకు బహిరంగ వేలం వేయబడును.

-కోడూరు వెంకట రాఘవరెడ్డి, ఛైర్మన్
శ్రీరాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము, దర్గామిట్ట - నెల్లూరు -4

### రాపూరులో నిరంతరం విద్యుత్ కోత

విద్యుత్ శాఖాధి కారుల నిర్లక్ష్యం వల్ల రాపూరు వాసులు ప్రతిదినం అప్రకటిత విద్యుత్ కోతను భరించ వలసి వస్తున్నది. రాపూరు ఆర్టీసి బస్టాండ్ సమీపంలో వున్న ట్రాన్స్ ఫారం పై అధిక భారం పడడంతో ప్రతి రోజూ ఫీజులు ఎగిరి పోతున్నాయి. రాత్రి వేళ వీటిని సిబ్బంది పట్టించు కోరు. ఈ ట్రాన్స్‌ఫారం పరిధిలో బజారువీధి, బస్టాండ్ సెంటర్, ముస్లిం వీధి వంటి పెద్ద ప్రాంతాలు ఉన్నాయి. పది రోజుల కొకసారి ట్రాన్స్ ఫారాలు కాలిపోతున్నా అదనపు ట్రాన్స్‌ఫారం ఏర్పాటు చేయాలన్న ఆలోచన విద్యుత్ అధికారులలో కలగక పోవడం వల్ల ప్రజలు పడరాని పాట్లు పడుతున్నారు. రాత్రి వేళల్లో దొంగల పాలిట వరంగా మారిందనడానికి రాపూరులో ఎక్కువైన చిల్లర దొంగతనాలే సాక్ష్యాలు. స్థానిక విద్యుత్ శాఖాధి కారులు ఉదాసీన వైఖరి వీడి అదనపు ట్రాన్స్ ఫారంను ఏర్పాటు చేసి పరిస్థితి చక్కదిద్దాలని ప్రజలు కోరుతున్నారు.

### ఆయిల్‌పామ్

5 పేజీ కొరవ

మాట్లాడుతూ ప్రభుత్వం ఆయిల్ పామ్ సాగుకు కంకణం కట్టుకొన్నట్లు చెప్పారు. హెక్టారుకు 4 సంవత్సరాలకు 38 వేలు ఖర్చవుతాయని, ఇందులో 16, 250 రూపాయలు ఎరువుల రూపేణా, మొక్కల రూపేణా సబ్సిడీగా ప్రభుత్వం అందిస్తున్నట్లు చెప్పారు. ఆయిల్ పామ్ రైతు సామంతు సుబ్బారెడ్డి తమ అనుభవాలను వివరించారు. సంస్థ మేనేజింగ్ డైరక్టర్ జక్కా శ్రీనివాసులు రెడ్డి, మాజీ ఎమ్మెల్యే శ్రీ జెక రెడ్డి, జనరల్ మేనేజర్ టి. ప్రసాద్ రెడ్డి తదితరులు మాట్లాడారు.

### 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### నెల్లూరు ముచ్చట్లు

#### పెళ్ళాన్ని పొడిచి కోర్టుకొచ్చిన ధీరుడు

రెండో పెళ్లాన్ని చూరుకత్తితో 3 పోరుపులు పొడిచి నెత్తురు ప్రవాహంలో చచ్చిం దనుకొని అక్కడ వాళ్లు తరుముకొన్నా దొరక్కుండా కండ్లేటి ప్రవాహాన్ని యీది పొడిచి కత్తిని అయెట్లో పారవేసి 25 మైళ్లు నడిచి మధ్యాహ్నం 2.30 గంటలకు నెల్లూరు జడ్జి కోర్టుకు వచ్చి నేరాన్ని నివేదించాడు. జిల్లా కోర్టు [illegible] [illegible] కేపయ్య గారు [illegible] వ్రాసి నెల్లూరు టవున్ పోలీస్ స్టేషన్‌కు పంపారు. పొడవబడ్డ భార్య నెల్లూరు ఆసుపత్రిలో వున్నది. ప్రాణ భయం లేదు.

#### ట్రంకురోడ్డు డబుల్ ఖూనీ

వెంకటగిరి తా. మార్లగుంట, జంగం మామిడి వీరయ్య, తన భార్య చెంగమ్మను, మిండగాడు టి.కె. నారాయణ నాయరును నెల్లూరు టవున్ హాలు ఎదుట ట్రంకురోడ్డులో 22.10.45 రాత్రి ఖూనీ జేసిన కేసు సబ్ మేజిస్ట్రేటు కోర్టులో 14, 15 తేదులు 14 మంది సాక్షులను




విచారించారు. చెంగమ్మ తల్లిన్నీ, వీరయ్య అప్ప జెల్లెలు అయిన వీరమ్మ గూడా సాక్షం చెప్పింది తన తమ్ముడు తానే ఖూనీ చేసినట్లు తనతో చెప్పినాడని. ముద్దై యిప్పుడు గూడా కోర్టులో వప్పుకుంటున్నాడు.

-విమర్శకుడు

#### అల్లూరుసభ

రైతుల పొలాలు మిలిటరీ వారి కొరకై లాగేసే బిల్లును నిరసించి, దానిని విరమించమని మద్రాస్ ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ 3వ తేది జరిగిన బహిరంగ సభలో తీర్మానించారు. సభకు శ్రీ యేటూరి సత్యసేనా రెడ్డి గారు అధ్యక్షత వహించిరి. శ్రీ చుండి జగన్నాథం (నెల్లూరు) గారు తీర్మానాన్ని విపులీకరించిరి.

పిమ్మట శ్రీ వేమూరు లక్ష్మయ్య గారు మాట్లాడి స్థానికమైన వాద బాధలు - బీద బిక్కి ఉచితంగా అనాదిగా అనుభవించే హక్కును కంట్రాక్టుదార్లు కొందరు పోగొట్టిన విధాన్ని తెలియజేశారు. దాన్ని నిరసిస్తూ మరొక తీర్మానం సభలో ఆమోదించారు.

భారత జాతీయ సైనికులను విడిపించమనీ, అల్లూరు దేశభక్తులను (4 ఏండ్లు శిక్ష అల్లీ పురంలో అనుభవించే వార్ని) వెంట విడిపించ వలెనని కూడా సభలో తీర్మానించారు. సభకు ముందుగా [illegible] తిరిగి విద్యార్థి కాంగ్రెస్ [illegible] జాతీయ గీతాలు పాడుతూ ప్రచారం చేశారు.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 | 5,000/- |
| 9674 | 6,000/- |
| సున్నాలు | 3,500/- |
| మొలగొలుకులబియ్యం(70 [illegible] | [illegible]00/- |
| బంగారు సవర 8 గ్రా | 3,760/- |
| వెండి 10 గ్రా | 75/- |

### పంచాంగం

#### నవంబరు తిథులు

కార్తీక బహుళ
తే 18 శని ఏకాదశి రా.గ.1.58 వ
తే 19 ఆది ద్వాదశి రా.గ.1.36 వ
తే 20 సోమ త్రయోదశి రా.గ.12.30 వ
తే 21 మంగళ చతుర్దశి రా.గ.11.23 వ
తే 22 బుధ అమావాస్య రా.గ.9.34 వ
మార్గశిర శుద్ధ
తే 23 గురు పాడ్యమి రా.గ. 7.30 వ
తే 24 శుక్ర విదియ సా.గ. 5.25 వ
స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ


జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-


### కాకినాడ మొదటి అ.డి.ము. కోర్టులో

O.S. 629/94

బ్యాంక్ ఆఫ్ ఇండియా, మెయిన్ బ్రాంచి, కాకినాడ -వాది

మరియు

దేవరశెట్టి గురుస్వామి,
S/o. సుబ్బరామయ్య
తెల్లపాడ గ్రామం, కనిగిరి
నెల్లూరు -ప్రతివాది

పై నంబరు దావాలో, మీకు నోటీసు నిమిత్తం 19.12.95 తేదిన వాయిదా అయి ఉన్నది. ఆ రోజు ఉదయం 10.30 గంటలకు పై కోర్టులో మీరు స్వయముగా గాని, ప్లీడరు ద్వారా గాని హాజరు కావలెను. లేనిచో, మీ పరోక్షమున కేసు తీర్మానించ బడునని, ఇందు మూలముగా తెలియ చేయనైనది.

[illegible] మర్ల నరసింహారావు
10.11.95 అడ్వకేట్
H.No. 1-9-7, Sriramnagar, Kakinada -3.

### కోవూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No. 57/1995

పినాకిని గ్రామీణ బ్యాంకు,తలమంచి
Rep. by its Manager -వాది

Vs

1. మల్లిపెద్ది అన్నపూర్ణమ్మ,
2. కొల్లు సురేష్ -ప్రతివాదులు

To, (1) మల్లిపెద్ది అన్నపూర్ణమ్మ
W/o. సుబ్బరామయ్య
పద్మనాభసత్రము
(2) కొల్లు సురేష్
S/o. [illegible]
పద్మనాభ [illegible]

పై నంబరు దావా మీ మీద దాఖలు అయినందున 11.12.95 తేది నాడు మీరు పై కోర్టుకు ఉదయం 10 గంటలకు హాజరు [illegible] మీకు గల ఆక్షేపణలు తెలుపు కొనవలెనని. లేనిచో మీ పరోక్షమున కేసు తీర్మానము చేయబడును.

ఆర్.కె. శర్మ
వాది లాయరు, కోవూరు

# రాధిక శ్రీలంకకు ఎందుకు వెళ్తున్నట్లు?

రాధిక పుట్టి పెరిగింది శ్రీలంకలోనే కావొచ్చు. "చాలా చిత్రాలలో నటించాక ఇప్పుడు ఈమె శ్రీలంకకు ఇటీవల పలుమార్లు వెళ్ళి రావడ మేమిటి? ఎల్‌టిటిఇ వాళ్ళతో ఈమెకు ఏదైనా సంబంధం ఉందేమో అనుకోడానికి వీల్లేదే! అని బుర్రలు వేతక్కించుకున్న చాలా మందికి ఊరట

కలిగింది. ఆమె భారీ ఎత్తున అక్కడ శాటిలైట్ (ట్రాన్స్‌మిషన్) ఏర్పాటు గురించి మంతనాలు సాగిస్తుంది. ఈ

ఏర్పాటు పూర్తయిన వెంటనే రాధిక టివి వంటిదేదో తమిళ కార్యక్రమాలను ప్రసారం చేస్తుంది.

### రవళికి వచ్చిన కోపం

ఆ సినిమా తార పత్రిక విలేకరి నటి రవళిని ఒకే ప్రశ్న అడిగాడు "మీకు మొదట శైలజ అని పేరు ఉండేది కదండీ?" అంతే, రవళికి అరికాలి మంట నెత్తికెక్కింది. "ఈ రిపోర్టర్లకు వేరే పని ఉన్నట్టు లేదు. ఏదో వచ్చాం సినిమా గురించి ఒకటి రెండు విషయాలు తెలుసు కున్నాం. ఏదైనా టిఫిన్ ఇస్తే మెక్కి, వంద రూపాయల నోట్లున్న కవరను ఇస్తే జేబులో పెట్టుకొని తమ దారిలో తాము పోక - ఎందుకట ఈ చొప్పదంటు ప్రశ్నలు! పాఠకులకు ఏ విధంగా ఈ విషయాలు ఆసక్తి కలిగిస్తాయి! అని గొణుక్కుంది. రిపోర్టర్ చల్లగా జారుకున్నారు.

# ప్రభుదేవాకు నాగేష్ కుమారుడి సవాల్!

"ఏమిటి అందరూ ప్రభుదేవాను ఆకాశానికి ఎత్తేస్తున్నారు! కావాలంటే అతన్ని, నన్ను ఒక చిత్రంలో బుక్ చేయమనండి. ఎవరి డాన్స్ బాగుంటుందో అప్పుడు తెలుస్తుంది!" అని సవాల్ విసిరాడు హాస్య నటుడు నాగేష్ కొడుకైన బ్రేక్ డాన్సర్ ఆనంద బాబు.

### శ్రీలేఖ గానం

చిన్న వయసులోనే సంగీత దర్శకురాలిగా ఖ్యాతి గాంచిన శ్రీలేఖ, పాప్ సింగర్ హరిహరన్‌తో కలిసి "ఎంతో చిత్రమీ సంగతి" అనే పాట పాడింది "సంప్రదాయం" చిత్రం కోసం. దర్శకుడు, సంగీత దర్శకుడు: ఎస్.వి. కృష్ణారెడ్డి.

### మృగం

రాంగోపాల్ వర్మ తెలుగు చిత్రాలు తీయనని శపథం చేశాడు కదా? అందుకని ఆయన వద్ద శిక్షణ పొందిన సురేష్ వర్మ "మృగం" అనే చిత్రానికి

దర్శకత్వం వహిస్తున్నాడు. "మనిషి ఎందుకు మృగంగా మారుతాడు అనేది చెప్పడానికే ఈ సినిమా" అన్నాడీ ఇరవై మూడేళ్ళ యువకుడు. చక్రవర్తి, మహేశ్వరి, ప్రకాష్ రాజా, తనికెళ్ళ భరణి, రంగనాథ్, చలపతి రావు, గుండు హనుమంత రావు, జీవా, శివ పార్వతి, ఫణి పాత్రధారులు. సంగీతం: రాజ్.

ఆనాడు వద్దన్న తారలే ఈనాడు వెంటబడుతున్నారు!

# అర్జున్ అనుభవం!

"నేను ఒక్క చిత్రమైనా లేకుండా ఇంట్లో ఖాళీగా ఉన్న రోజుల్లో సొంత చిత్రాన్ని నా డైరక్షన్‌లో తీయడానికి నిశ్చయించాను. అప్పుడు నా పక్కన నటించడానికి ఎంత మంది హీరోయిన్లను అడిగానో తెలుసాండీ? ఇతనికి మార్కెట్ లేదు. ఇతనితో నటిస్తే మనకున్న మార్కెట్ కూడా పోతుంది, పైగా ఇతను డైరక్షన్ చేయడ మేమిటి? అని కొందరు తారలు [illegible]. నాకెవ్వరూ అంగీకారం తెలియ

జేయలేదు. ఇప్పుడు నేను హీరోగా బిజీ అయ్యాక హీరోయిన్‌లు పదే పదే నాకు ఫోన్ చేసి మీ చిత్రాలలో ఏదైనా ఒక్క దానిలో మీ పక్కన నటించే అవకాశం

**మద్రాసు సినిమా వార్తలు**

కల్పించరూ! అంటూ కోరుతున్నారు. కాచిన చెట్టుకే రాళ్ళ దెబ్బలు అంటే ఇదేనేమో అని విరగబడి నవ్వాడు అర్జున్.

### "ఆడదొంగ"

"టైటిల్‌ను ఆడదొంగ - నాగకన్య" అని మార్చాలని నిర్మాత ఆలోచిస్తున్నారు. నేను చేస్తున్నవి ద్విపాత్రలు. అల్లరి చిల్లరగా తిరుగుతూ చిన్న చిన్న దొంగ తనాలు చేసే ఎంటర్ టైనింగ్ కేరక్టర్ ఆడదొంగ. చాలా ఎమోషనల్‌గా ఒక నటిలోని ప్రతిభా విశేషాలను బయట పెట్టే పాత్ర నాగకన్య" అంది విజయ శాంతి. పాము ఉందంటే గ్యారంటీగా విజయవంత మవుతుందని ఇది వరకు 'నాగదేవత, నాగాస్త్రం' చిత్రాలు రుజావు చేసాయి గనుక ఈ చిత్రం కూడా ఆ కోవలో దిగ్విజయం సాధించవచ్చు. పైగా గ్రాఫిక్స్‌తో ప్రేక్షకులను గగుర్పాటు కలిగించే ఎన్నో స్పెషల్ ఎఫెక్ట్స్‌ను హాంకాంగ్‌లో సృష్టించాలని

కొరవ 10 పేజీలో

కథ, కథనం, దర్శకత్వం, నటన, సంగీతం ఏవీ బాగాలేవు

# ఆలుమగలు

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

రాము (సుమన్) అనే కుర్రాడు, మల్లి (మీనా) అనే కుర్రదాన్ని పెళ్ళి చేసు కోవాలను కుంటాడు. ఈ ఇద్దరూ ఒక పల్లెటూరు వాసులు. వారిద్దరి పెళ్ళికి ఒక అడ్డంకు ఏర్పడుతుంది. సింహాచలం (నర్సింగ్ యాదవ్) అనే దగుల్బాజీ మల్లిని చిన్నప్పటి నుంచి పెంచి పెళ్ళి చేసు కోవాలను కుంటాడు. తాను మల్లిని పెళ్ళి చేసుకోవాలన్న విషయాన్ని రాము గ్రామ పెద్దల ముందు వుంచుతాడు. సింహాచలానికి కొంత డబ్బు చెల్లించి మల్లిని పెళ్ళి చేసుకోమని రాముకు గ్రామ పెద్దలు సలహా చెప్తారు. ఆ డబ్బు సంపా దించేందుకు రాము పట్నం పోతాడు. అతను గాయకుడు కావటంతో పాటలు పాడి డబ్బు సంపా దిస్తుంటాడు. అతని పాట విన్న మల్లీశ్వరి (ఆమని) అనే ఒక శ్రీమంతుల పిల్ల, అతని మీద మోజు పెంచు కుంటుంది. ఒక ప్రమాదం నుంచి మల్లీశ్వరిని రాము రక్షిస్తాడు. దానితో రాము మీద మల్లీశ్వరి మోజు తారాజువ్వలా ఆకాశానికెగురుతుంది. రాముని పెళ్ళి చేసుకో దలుస్తుంది. కాని ఆమె తండ్రికి (సత్య నారాయణ) ఆ పెళ్ళి ఇష్టం లేదు. అయినా మల్లీశ్వరి రాము చేత తాళి కట్టించు కుంటుంది.

పల్లెటూరి మల్లి, రాముని వెతుక్కుంటూ పట్నం వస్తుంది. అసలు విషయం తెలుసు కుంటుంది. మల్లీశ్వరితో లడాయికి దిగుతుంది. ప్రేమ ఒక చోట పెళ్ళి మరో చోట అవుతుంది.

విజయేంద్ర ప్రసాద్ వ్రాసిన ఈ కథ అపజయం పొందింది. ఇద్దరు హీరోయిన్లు, ఒక హీరో తతంగంగా తయారైంది. కథలో ఎక్కడా కొత్తదనంగాని పట్టుగాని లేవు. ఆయనే వ్రాసి మాటలు, కథను, సన్నివేశాలను నీరస పరిచాయి.

దర్శకుడు సాగర్ చిత్రమంతా ఎక్కడ వెతికినా కనిపించడు. అతనికి బదులు నీరసించిన కథా గమనం, వియోగమైన సన్నివేశాలు, నిరాశ కలిగించే దృశ్యాలు, సరిగ్గా ఎదగని పాత్రలు కనిపిస్తాయి. హీరో రాము పాత్ర చాలా చప్పగా వుంది. ఈ హీరో చేత మారు వేషం వేయించి ఇద్దరు హీరోయిన్లను మధ్య పెట్టడం అధ్వాన్నంగా వుంది. హీరోకు ఫైటింగులు, డాన్సులు వుండాలి కాబట్టి, హీరో చేత ఆ రెండు కార్యక్రమాలు హీరో ఆనవాయితీ పోకుండా జరిపించాడు. ఈ పాత్రలో చేసేది ఏమీ లేక, తన నటనా శక్తి రుజావు చేసుకోలేక నిస్సహాయంగా నిలబడి పోయాడు సుమన్. హీరోయిన్లు మీనా, ఆమని వీరిద్దరూ కథానాయికలే కాని కథకు అనుకూలంగా లేరు. హీరోతో ఒకరు మార్చి ఒకరు డాన్సులు చేసేందుకు చక్కగా అనుకూలించారు. పోను పోను తెలుగు చిత్రాల్లో హీరోయిన్ అనే పదానికి అర్థం మారి పోతుంది.

మల్లీశ్వరి తండ్రిగా సత్య నారాయణ పాత్ర ఎందుకూ పనికి రానిదై పోయింది. కోట శ్రీనివాస రావు పోషించిన విలన పాత్ర చప్పగా వుంది. అతని కుమారుడుగా నటించిన సుధాకర్ పాత్ర పేలవంగా వుంది. ఈ తండ్రి కొడుకుల సంబంధాన్ని ఎబ్బెట్టుగా చూపబడింది. వీరిద్దరి చేత చేయించిన హాస్యం అపహాస్యంగా తయారైంది. ఇటువంటి నీరసమైన పాత్రల్లో వుంచి

కొరవ 10 పేజీలో

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

లాలతో వేస్తూ పోయిన నినాదాలు కొందరిలోనైనా ఆ దురలవాటు మానాలన్న ఆలోచనను తెచ్చి వుంటాయి. ప్రదర్శనలో మాతరన్, నేతాజీ హైలట్, సారన, లిటిల్ ఫ్లవర్, అంగ్లోఫిల్, శ్రీ శారద, వేలాంగణి, సిద్ధార్థ ఇంగ్లీషు మీడియం స్కూళ్ల విద్యార్థులు పాల్గొన్నారు. గాంధీ బొమ్మ సెంటర్ వద్ద నుండి బయలు దేరిన ప్రదర్శన ఎసి సెంటర్ మీదుగా నవాబు పేట వరకు పోయి తిరిగి రాఘవ సినీ కాంప్లెక్స్ రోడ్డు, వి.ఆర్.సి. సెంటర్ మీదుగా టౌనుహాల్ చేరింది. అక్కడ ఏర్పాటు చేసిన ఇటువంటి బహిరంగ సభలో వాకాటి విజయ కుమార్ రెడ్డి మాట్లాడారు. ధూమపానం వల్ల కలిగే అనర్థాలు అన్నిన్ని కావు; పది కాలాల పాటు ఆరోగ్య కరంగా జీవనం కొనసాగించా లంటే ధూమపానం మాని తీరాలన్నారు. విద్యార్థులను ఉద్యమంలో భాగస్తులు చేయడంతో తమ తండ్రుల పై వారు తీసుకొచ్చే వత్తిడి వల్ల వుద్యమం విజయ వంత మవుతుందన్నారు. జన విజ్ఞాన వేదిక

డాక్టర్లు విజయ్ కుమార్ మాట్లాడుతూ ప్రజల ఆరోగ్యం కంటే సిగరెట్, పొగాకుతో తయారు చేసే పదార్థాల విక్రయం పైనే ప్రభుత్వం ఎక్కువ మమకారం చూపిస్తున్నట్లు చెప్పారు. డాక్టర్ సి.ఆర్. రెడ్డి, అనిల్ కుమార్ రెడ్డి, రక్తదాతల సంఘం సుకుమార్ రెడ్డి, లయన్స్ క్లబ్ అధ్యక్షుడు జి. పాండు రంగం, కార్యదర్శి ఉదయ భాస్కర్, రీజనల్ ఛైర్మన్ రామ్మోహన రావు, జోనల్ వైస్ ఛైర్మన్ వై. సురేష్, లయన్ లేడీలు అమృత వల్లి, ప్రమీలా రాణి, జ్యోతి, నిర్మల తదితరులు పాల్గొన్నారు. వేలాది మంది విద్యార్థులతో సాగిన ప్రదర్శన వల్ల పలు చోట్ల ట్రాఫిక్ నిలిచి పోయింది.

### గ్రామీణ క్రీడోత్సవాలు

ఆంధ్రప్రదేశ్ గ్రామీణ క్రీడోత్సవాలను 15 తేది ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి ప్రారంభించారు. 15 తేది నుంచి 18 తేది వరకు ఈ క్రీడోత్సవాలు జరుగుతాయి. ఈ సందర్భంగా క్రీడాకారుల గౌరవ వందనం స్వీకరించిన అనంతరం ఆనం వివేకానంద రెడ్డి మాట్లాడుతూ క్రీడల్లో శాస్త్రీయ పద్ధతులను ఉపయోగించి క్రీడాకారులు తమ శక్తి సామర్థ్యాలను పెంచు కోవాలని కోరారు. నెల్లూరు టౌన్‌లో ఈ క్రీడోత్సవాలు నిర్వహించడం గర్వ కారణ మన్నారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ మాట్లాడుతూ క్రీడల విషయంలో దేశం వెనుకబడి వుండడం పట్ల ఆవేదన వ్యక్తపరుస్తూ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగిన ప్రోత్సాహం అందించి వీటిని అభివృద్ధి చేయాలన్నారు. ఆంధ్ర ప్రదేశ్ స్పోర్ట్స్ అథారిటీ ఛైర్మన్ పి.ఆర్. మోహన్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు క్రీడల పట్ల చూపుతున్న సవతి తల్లి ప్రేమను దుయ్య బట్టారు. మేఘాలయ వంటి చిన్న రాష్ట్రం క్రీడల కోసం 8 కోట్ల రూపాయల బడ్జెట్ కేటాయిస్తుండగా, మన రాష్ట్రంలో 4 కోట్ల మాత్రమే ఇస్తున్నారని ఇందులో 1.20 కోట్లు జీత భత్యాలకే సరి పోతున్నట్లు వివరించారు. మునిసి పాలిటీ వసూలు చేసే పన్నులలో కొంత మొత్తం క్రీడల నిర్వహణకు కేటాయించాలని కోరారాయన. ఈ క్రీడోత్సవాలకు 22 జిల్లాల నుంచి బాల బాలికలు తరలి వచ్చారు.

### గ్రంథాలయ వారోత్సవాలు

జిల్లా గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యంలో 28వ జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు 14 తేది నుండి 20 వరకు మహిళా గ్రంథాలయంలో జరుగు తున్నాయి. 18 తేది నురవరం ప్రతాప రెడ్డి జీవితం - గ్రంథాలయ సేవలపై ప్రత్యేక ప్రసంగం ఏర్పాటు చేస్తున్నారు. పౌర సమాచార సంబంధ శాఖ మాజీ ఉప సంచాలకులు వై.వి. రత్నం, సాహితీవేత్త కె. వెంకట సుబ్బయ్య, విద్వాన్ కూరపాటి లింగరాజా ఈ కార్యక్రమంలో పాల్గొంటారు. 19 తేది మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని రంగోలి పోటీలు పెడుతున్నారు. ఆ సాయంత్రం ఏర్పాటు చేసే సభా కార్యక్రమంలో నెల్లూరు ఆర్డీఓ కుమారి టి.కె. శ్రీదేవి, శ్రీమతి ఫరీదా హుసేన్, గిరిజా కుమారి, పద్మజా రెడ్డి, డి. శైలజా రెడ్డి పాల్గొంటారు. 20 తేది విద్యార్థులకు నిర్వహించిన పోటీల్లో విజేతలకు బహుమతులు పంచే కార్యక్రమంలో మునిసిపల్ కమీషనర్ సి. శివకుమార్ జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు మెట్టా చంద్రశేఖర రెడ్డి తదితరులు పాల్గొంటారు. ఈ సందర్భంగా ప్రతిదినం పౌర సంబంధాల శాఖ వారిచే చలన చిత్రాలు కూడా ప్రదర్శిస్తారని సంస్థ కార్యదర్శి వీణా రమాపతి రాజా తెలియ చేస్తున్నారు.

### ఘంటసాల 73వ జయంతి

కళారాధన సాంస్కృతిక సంస్థ ప్రముఖ నేపథ్య గాయకుడు స్వర్గీయ ఘంటసాల వెంకటేశ్వర రావు జయంతిని డిశంబర్ 8 తేది, జరుపుతుంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో రాష్ట్ర స్థాయిలో సినిమా, లలిత, జానపద సంగీతం పోటీలు నిర్వహిస్తున్నారు. ఘంటసాల కుమారుడు విజయ కుమార్ ఈ కార్యక్రమానికి ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేస్తారు. పోటీలలో పాల్గొన గోరె ఔత్సాహిక కళాకారులు టి. చంద్రశేఖర రెడ్డి, కార్యదర్శి, కళారాధన, ట్రంకురోడ్డు, నెల్లూరు -1. చిరునామాకు వ్రాసి ఇతర వివరాలు తెలుసు కోవచ్చు.

### వెంకటేశ్వర పురం సమస్యలు తీర్చండి!

సైకిల్ పై వచ్చి, ఏదో ఒక ప్రకటన తెచ్చి పత్రికా కార్యాలయాల్లో ఇస్తుంటాడు ఒకటవవార్డు మాజీ కౌన్సిలర్ గౌసు మొహియుద్దీన్. ఏ మంత్రి, అధికారి వచ్చినా పట్టు విడవ కుండా వెంకటేశ్వర పురంలోని సమస్యల చిట్టాను వాళ్లకు అందిస్తాడు. 9 తేది నెల్లూరు వచ్చిన రవాణా శాఖ మంత్రి వందమూరి హరికృష్ణకు తన వార్డులో 1992 నుండి 97 వరకు మునిసి పాలిటీలో మంజూరై, పనులు చేపట్టని 30 సమస్యల చిట్టాను సావధానంగా వినిపించే సరికి వార్డుకు ఇన్ని సమస్యలా అని మంత్రి వుక్కిరి, బిక్కిరి అయ్యారట. పట్టువదలని విక్రమార్కుడిలా తిరుగు తుండే గౌస్ మొహియుద్దీన్ [illegible]. వెంకటేశ్వర పురం సమస్యల [illegible] సామాన్యంగా తీరవి కావు.

### ప్రెస్ కార్మికుల విజయం

జీతాల పెంపుకై ప్రింటింగ్ ప్రెస్ కార్మికులు 6 తేది నుండి చేస్తున్న సమ్మెను 13 తేది విరమించారు. ప్రస్తుతం ఇస్తున్న దినసరి వేతనం పై అదనంగా 15 రూపాయలు ఇచ్చేందుకు, ఇతర అంగీక రించాయి. సౌకర్యాలు కల్పించేందుకు ప్రెస్ యాజమాన్యాలు, అసిస్టెంట్ లేబర్ కమీషనర్ లక్ష్మి నారాయణ సమక్షంలో జరిగిన చర్చల్లో ఒప్పందం కుదుర్చు కున్నారు. తమ సమ్మెకు మద్దతు పలికిన వారికి జిల్లా ప్రెస్ వర్కర్స్ యూనియన్ అధ్యక్ష కార్యదర్శులు కృష్ణమూర్తి, సుధాకర్ కృతజ్ఞతలు చెబుతున్నారు.

### బేకరీ యూనిట్‌లో శిక్షణకు దరఖాస్తులు

నెల్లూరులోని తెలుగు బాల మహిళా ప్రాంగణంలో గ్రామీణ ప్రాంత స్త్రీలకు బేకరీ యూనిట్‌లో శిక్షణ ఇస్తారు. 18 నుంచి 35 సంవత్సరాల మధ్య వున్న స్త్రీలు ఆదాయ, కుల, నివాస, స్థల, పుట్టిన తేది ధృవీకరణ పత్రాలతో 25 తేది లోగా దరఖాస్తు చేయాలి. వీటిని పి. వెంకట లక్ష్మి తెలుగు బాల మహిళా ప్రగతి ప్రాంగణం, గాంధీనగర్, నెల్లూరు -4. చిరునామాకు పంపాలని కోరుతున్నారు.

### ఉచిత వైద్య శిబిరం

ఆంధ్రప్రదేశ్ అర్బన్ అండ్ రూరల్ సోషల్ డెవలప్ మెంట్ సొసైటీ భారత మహిళా మండలి ఆధ్వర్యంలో పడారుపల్లిలో 12 తేది ఉచిత వైద్య శిబిరం జరిపింది. 350 మంది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంపిణీ చేశారు. కార్యక్రమంలో డాక్టర్లు జి. జయచంద్ర, ప్రభావతి, ఉషారాణి, భారతి మహిళా మండలి అధ్యక్షురాలు ఎ. రాజేశ్వరమ్మ, వై. సుధీర్ కుమార్ తదితరులు పాల్గొన్నారు.

### డిసిసి ఆధ్వర్యంలో నెహ్రూ జయంతి

భారతదేశ తొలి ప్రధాని స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ 106 జయంతిని పురస్కరించుకొని 14 తేది డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి మద్రాస్ బస్టాండ్ వద్ద గల నెహ్రూ విగ్రహానికి పూల మాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. అనంతరం డిసిసి అధ్వర్యంలో ఇందిరా భవన్‌లో జరిగిన సభలో ఆనం సంజీవ రెడ్డి, చేవూరు దేవకుమార్ రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి నెహ్రూ గుణ గణాలను ప్రస్తుతించారు.

### లయన్స్ ఆధ్వర్యంలో నెహ్రూ జయంతి!

నెహ్రూ జయంతిని పురస్కరించుకొని 14 తేది నెల్లూరు లయన్స్ క్లబ్ టివిఎస్ కళ్యాణ సదన్‌లో స్కూల్ పిల్లలకు డ్రాయింగ్ పోటీలను నిర్వహించింది. సేవాప్రియ క్లబ్ వారు తిప్పరాజు వారివీధిలోని కె.వి.ఆర్ స్కూల్‌లో పిల్లలకు ఆటల పోటీలు పెట్టారు. ఈ కార్యక్రమాలను లయన్స్ అధ్యక్ష, కార్యదర్శులు బి. పాండురంగం, బి. ఉదయ భాస్కర రావు, సేవాప్రియ విభాగం నాయకురాళ్లు ప్రమీలా రాణి, సుభాషిణి పర్యవేక్షించారు.

### చెత్త ట్రాక్టర్లను నిలిపేశారు

నెల్లూరు మునిసి. పాలిటీ 15 వార్డులోని కంపోస్టు యార్డును తరలించమని గత ఆరు నెలలుగా ప్రజలు ఆందోళన చేస్తున్నారు. ఈ యార్డును తొలగించాలన్న తీర్మానాన్ని కూడా మునిసిపల్ కౌన్సిల్ ఆమోదించింది. 11 తేది అక్కడికి చెత్తతో వచ్చిన ట్రాక్టర్లను స్థానిక ప్రజలు అటకాయించి చెత్తను తోలకుండా చేసారు. రాంజీ నగర్, ఆదిత్య నగర్, చింతారెడ్డి పాలెం రోడ్డు కాలనీ, వెలగ చెట్టు సంఘం మహిళల ధాటికి తట్టుకోలేక మునిసిపల్ సిబ్బంది ట్రాక్టర్లను వెనుకకు తీసుక వెళ్లారు. ఈ కార్యక్రమానికి 11 వార్డు కౌన్సిలర్ పున్నం బసవయ్య, స్థానికులు టి. పెంచలయ్య, వెంకటేశ్వర్లు, అద్దూరు మస్తానయ్య తదితరులు నాయకత్వం వహించారు.

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

నటీ నటుల నటనా శక్తి బలై పోయింది. శ్రీలేఖ సంగీతం మాటలను పాటలను కబళించింది. సీతారామ శాస్త్రి, భువన చంద్ర, శివశక్తి దత్త వ్రాసిన పాటలు శ్రీలేఖ వాయిద్యాల హోరుకు బలై పోయాయి. శ్రీశైలం అందాలను ఎస్. గోపాల రెడ్డి కెమెరా చక్కగా చూపింది.

కథ బాగులేదు, కథనం బాగులేదు, సాగర్ దర్శకత్వం అంతకన్నా బాగులేదు. అందుకే చిత్రం ఏమీ బాగులేదు.

## సినిమా

9 పేజీ తరువాయి

అనుకుంటున్నాం" అన్నారు గోపాల్. ఈయన దర్శకత్వం వహించే పై చిత్రంలో విక్రమ్, ఆనంద్, సంఘవి, ఆలీ, ఎ.వి.ఎస్. మల్లికార్జున రావు, సిల్క్‌స్మిత, రచయిత పరుచూరి వెంకటేశ్వర రావు తదితరులు పాత్రధారులు. సంగీతం: కోటి.

### కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఆలీ

దుబాయ్‌లో ఆలీ స్నేహితులు చాలా మంది ఉన్నారు. వాళ్ళు తమ మిత్రుడు ఆలీ ఇంత బిజీ నటుడయి నందుకు సంతోషిస్తూ, అతను హీరోగా ఎ. కోదండ రామిరెడ్డి దర్శకత్వంలో ఒక భారీ చిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు.

### మరో గెస్ట్ పాత్రలో కృష్ణ

వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకోక పోతే యువతరం నటులు తమను వెనక్కు తోసేస్తారు. కృష్ణ వంటి హీరోలు ఈ విషయాన్ని పట్టించుకోక తప్పదు. "వారసుడు" చిత్రం తర్వాత నాగార్జున హీరోగా తయారయ్యే ఎస్.ఎస్. క్రియేషన్స్ చిత్రంలో కృష్ణ ఫ్లాష్ బ్యాక్‌లో కనిపిస్తారు.

### రాఘవేంద్రరావు కొత్త ప్రయోగం

"రాజేంద్ర ప్రసాద్ ఒక చిత్రానికి మ్యూజిక్ ఇచ్చినప్పుడు అతనికి సీనియర్ అయిన నేను ఏం తక్కువ తిన్నానూ" అని కె. రాఘవేంద్ర రావు "పెళ్ళి సందడి" చిత్రంలో నృత్యాలు, స్టంట్లకు [illegible] మాస్టర్లను పెట్టుకో[illegible] [illegible] చూసుకుంటున్నారు. "పెళ్ళి సందడి" చిత్రంలో శ్రీకాంత్ సరసన రవళి, దీప్తి భట్నాగర్ నాయికలు.

### పాపం సుమన్!

సుమన్ నటించిన చిత్రాలు ఒక్కొక్కటొక్కొక్కటిగా ఫెయిల్ అవుతున్నాయి. అతని చిత్రాల పట్ల కొనుగోలు దారులు ఏ మాత్రం ఆసక్తి చూపించడం లేదు. అసలు కథ మీద శ్రద్ధ కనపరచ కుండా అయిదారు ఫైట్లు, డాన్సులు ఉంటే చాలని సుమన్, అతనితో చిత్రాలు తీసే నిర్మాతలు భావిస్తున్నందువల్లే ఇటువంటి అపజయాలు. ఇటీవల "అలు మగలు" చిత్రాన్ని చూస్తే, సాగర్ వంటి దర్శకుడు, కాట్రగడ్డ ప్రసాద్ వంటి నిర్మాత ఇంతటి చెత్త కథను ఎలా ఎంపిక చేశారని అనిపిస్తుందెవరికైనా. కాట్రగడ్డ ప్రసాద్ చేతుల్లో సినిమా వార పత్రికల విలేకర్లున్నందువల్ల చిత్రం ప్రారంభం నుంచి విడుదలయ్యే వరకు మహా గొప్పగా వ్రాయించు కున్నారు. ఇటువంటి చెత్త చిత్రాల మధ్య టి.వి.లో ప్రతిరోజూ వెలువడే పాత చిత్రాలే ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

### విశిష్ట సినీ దంపతుల అవార్డు

నేడు చలన చిత్ర పరిశ్రమ డోలాయమాన పరిస్థితుల్లో ఊగిస లాడుతుంది. తగ్గు బడ్జెట్ చిత్రాలకు బయ్యర్లు రాకపోవడం ఒక బెడద. కేవలం హీరోను నమ్ముకొని బిగ్ బడ్జెట్ చిత్రం తీస్తే అది కాస్తో కూస్తో విజయం సాధిస్తుందనే నమ్మకం లేదు. ఎవరికీ ఎవరి మీదా నమ్మకం కుదరడం లేదు. ప్రాడక్ట్ మీద శ్రద్ధ ఎవరికీ ఉండడం లేదు. పైగా, లేనిపోని ఫాల్స్ ప్రెస్టేజీలకు పోయి తెలుగు సినిమా రంగం నానాటికీ అధ్వాన్నమై పోతూంది. ఏది ఎలా ఉన్నా మన రాష్ట్రంలో కొన్ని సంఘాల వారు సినిమా తారలకు అవార్డుల మీద అవార్డులు ఇవ్వడానికి డొనేషన్లు వసూలు చేస్తున్నారు. అటువంటి సంస్థలలో పద్మమోహన్ ఆర్ట్ థియేటర్ ఒకటి. వీళ్ళు ఒక కొత్త అవార్డును విశిష్ట సినీ దంపతులు పేర ప్రకటించి ఆ దంపతులుగా కృష్ణ, విజయ నిర్మలను పేర్కొన్నారు. కృష్ణకు ఇది ద్వితీయ వివాహం. విజయ నిర్మలకు కూడా. విశిష్ట దంపతులు అంటే వీరా - అని బుగ్గలు నొక్కుకున్న వారు లేకపోలేదు. ఇంతలో కృష్ణ ఇటీవల ఒక ప్రకటన చేశారు. "ఆ సంస్థ నిర్వాహకు లెవరో మాకు తెలియదు. వాళ్ళెవ్వరూ మమ్మల్ని సంప్రదించ కుండా ఈ అవార్డును ప్రకటించడాన్ని మేం ఖండిస్తున్నాం. ఆ అవార్డును మేము స్వీకరించడం లేదు!" అని సినిమా వార పత్రికలు ఈ విషయాన్ని బాక్స్ కట్టి మరీ ప్రచారం చేశాయి!


జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

## జనవాణి

(3 పేజీ తరువాయి)

ప్రభుత్వం ప్రకటించడం హర్షణీయం. గ్రామాల్లో వసతి సౌకర్యాలులేవంటూ పట్టణాల్లో క్లినిక్స్ పెట్టి ప్రభుత్వ డాక్టర్లు రెండు చేతులా సంపాదిస్తున్నారు. పవిత్రమైన వైద్య వృత్తిని వరం చేసి వున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే డాక్టర్లకు అదనంగా కొన్ని సౌకర్యాలను ప్రభుత్వం కల్పిస్తే, డాక్టర్లు సాకులు చెప్పే వీలుండదు.

-పి. ప్రభాకర్

### ఎసి సెంటర్‌లో గుంత పూడ్చడం సబబే!

నిత్యం వేలాది మంది పాద చారులు, వందల కొద్ది వాహనాలు తిరిగే ఎసి బొమ్మ వద్ద ఉయ్యాల కాల్వ పై వుండిన గుంతను మునిసిపల్ ఛైర్మన్ వివేకానంద రెడ్డి మూయించడం సమంజసం. ఈ విషయమై గత మునిసిపల్ కౌన్సిల్ సమావేశంలో కొందరు కౌన్సిలర్లు ఆక్షేపణ తెలిపిన తీరు బాగోలేదు. నెల్లూరు కౌన్సిలర్లు చాలా మంది ఏదో విధంగా గలభా సృష్టించి పేపర్లో పేరు చూసుకొని అబ్బురపడే మనస్తత్వం కలిగిన వారు కావడం బాధాకరం. కౌన్సిలర్లు, ఛైర్మన్ ఏకోన్ముఖంగా, సంఘటితంగా ప్రశాంతంగా, సమష్టి ఆలోచనలతో పట్టణాభివృద్ధి దీక్షా బద్ధులైతే సిబ్బంది, అధికారులు దారికి వస్తారు. అది మరచి వుత్తుత్తి ఉపన్యాసాల జోరుతో కౌన్సిల్ సమావేశాల్లో నోరు బారుగా మాట్లాడి నంత మాత్రాన అభివృద్ధి జరగదు. ఉయ్యాల కాల్వకు పడిన ఈ గుంట పరమ అసహ్యంగా వుండింది. ఎందరో అందులో పడి కాళ్లు, చేతులు విరగ్గొట్టుకొని మునిసి పాలిటీని నానా శాపనార్థాలు పెట్టిన తరువాత ఛైర్మన్ దానికి రిపేరు చేయిస్తే అధిక్షేపించడం సబబా? దానికి ఆ మాత్రం ప్రజోపయోగ కార్యక్రమం పైతన విచక్షణాధి కారంతో నిర్ణయం తీసుకొనే హక్కు ఛైర్మన్‌కు లేకుంటే ఆయన ఆ కుర్చీలో కూర్చోవడం శుద్ధ దండగ.

నెల్లూరు -ములుమూడి ప్రభాకరరావు

### కోడూరు, మైపాడు రోడ్లకు బాగు పడే రాతలేదా?

సర్వేపల్లి నియోజక వర్గానికి పట్టు కొమ్మలైన కోడూరు, మైపాడు దాని మజరా గ్రామ ప్రజలు బస్సులకై నిత్యం ఎదురు చూడాల్సిన పరిస్థితి దాపురించి వుంది. ఈ గ్రామాలకు వెళ్లే రోడ్లు అలివిగాని లోతైన గుంటలు, ఎత్తు పల్లాలతో పరమ ఛండాలంగా తయారై వున్నాయి. కోడూరు రోడ్డు మరమ్మత్తులకు 21 లక్షలు కేటాయించినట్లు ఎమ్మెల్యే స్వయంగా ప్రకటించినా ఇంత వరకు పనులు మొదలు పెట్టిన పాపాన పోలేదు. ఆ రోడ్లను సాకుగా చూపించి వకాలంలో బస్సులు నడపడం లేదు. దీన్ని నిరసిస్తూ ప్రజలు ఈ రూట్‌లో పలు చోట్ల ఆ మధ్య బస్సులను ఆపేశారు. 8, 9 తేదీల్లో సొతు అములూరు బిసి కాలని వద్ద బస్సులు కదల నీయకుండా ఆపి వేయడం వల్ల ఆ రూట్‌లోని వారు నెల్లూరుకు నడిచి రావాల్సి వచ్చింది. ఈ ప్రాంత జడ్పిటిసి మెంబరు, అల్లీపురంలోనే వుండిన ఎమ్మెల్యే కూడా ఈ విషయాన్ని తెలిసికొని కూడా పట్టించు కోలేదు.

కోడూరు -పల్లూరు మాధవరావు

### వేరుశెనగ నూనెలో కల్తీ

నిత్యావసర వస్తువైన వేరు శెనగ నూనె వినియోగ దారుల పాలిట విషంగా తయారై వుంది. నెల్లూరు టౌన్‌లోని మిల్లుల వారు ముక్కి పోయిన పప్పు బాగా ఎండని పప్పు నూనె తయారీకి వినియోగిస్తూ ప్రజలను రోగాలపాలు చేస్తున్నారు. మార్కెట్‌లో విరివిగా దొరుకుతున్న కల్తీ వేరుశెనగ నూనెతో తయారు చేసిన ఆహార పదార్థాలు కొన్ని సార్లు చేదుగా మరికొన్ని సార్లు చిక్కగా వుంటున్నాయి. ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొని టౌన్‌లోని అన్ని మిల్లులను రిఫైండు మిల్లులుగా మార్చాలి. అర కిలో మొదలుగా ప్యాకెట్ల రూపంలో శుద్ధమైన వేరు శెనగ నూనెను విధిగా మార్కెట్‌లో సరఫరా అయ్యే ఏర్పాట్లు చేయడంలో కలెక్టర్ శ్రద్ధ వహించాలి.

నెల్లూరు -పి. మహేశ్వరి

### మరో శాంతి పావురం నేల రాలింది

ప్రపంచ శాంతికి కృషి చేసినందుకు నోబుల్ శాంతి బహుమతిని స్వీకరించిన ఇజ్రాయిల్ ప్రధాని రాబిన్, ఎవరూ ఊహించని రీతిలో తన స్వంత దేశంలోనే ఓ ఉన్మాది చేతిలో ప్రాణాలు కోల్పోవడం దారుణం. రాబిన్ ఇజ్రాయిల్ చరిత్రలో గొప్ప నాయకుడు. పి.ఎల్.ఓ. నాయకుడు యాసర్ అరాఫత్‌తో కలసి ప్రపంచ శాంతికి ఎనలేని కృషి చేశాడు. పశ్చిమాసియాలో శాంతి కోసం అవిరళ కృషి చేసిన శాంతి పావురం తీవ్రవాద ఘాతక చర్యకు బలి కావడం అందరూ ఖండించి తీరాలి.

నెల్లూరు -జె. పోలిరెడ్డి

### ఎన్టీఆర్‌కు జ్ఞానోదయ మయ్యేదెన్నడో?

ఇటీవల లక్ష్మిపార్వతి రాజకీయ రంగ ప్రవేశం మీద ఏ నిర్ణయం తీసుకోలేక నలిగి పోతున్నట్లు తెలుగు దేశం అధినేత ఎన్టీ రామారావు చెప్పారు. అసలు లక్ష్మిపార్వతి రాజ్యాంగేతర శక్తిగా ప్రతి నిర్ణయంలోనూ జోక్యం చేసుకోవడం వల్లే తాను గద్దె దిగ వలసి వచ్చిందని ఎన్టీఆర్ మరచి పోయినట్లున్నారు. ఆమె సేవలు తనకే పరిమితమనీ, రాజకీయాలతో ఏ మాత్రం సంబంధం లేదని పదవి పొయ్యాక పదే పదే ప్రకటించారు. లక్ష్మి పార్వతి తనతో పాటు రాజకీయాల్లో పాల్గొంటుందని మొదటే ప్రకటించి వుంటే ఎవరూ వ్యతిరేకించే వారు కాదేమో. ముఖ్య మంత్రి భార్యగా తెరచాటు రాజకీయాలనే రాజ్యాంగేతరమని ప్రజలు ఈసడించారు. ఈ విషయాలు ఎన్టీఆర్ క్షుణ్ణంగా తెలుసుకొని జ్ఞానోదయమై ఎప్పుడు సక్రమమైన రీతిలో ప్రవర్తిస్తారో? ఆ క్షణాల కోసం ఆయన అభిమానులు ఎదురు చూస్తున్నారు.

నెల్లూరు -కె. విజయకుమార్

### ఎన్టీఆర్ తీరే వేరు

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు ప్రవర్తనా తీరే వేరు. చంద్రబాబు నాయుడు వర్గంలోకి పార్టీలోని ఎమ్మెల్యే లందరూ వెళ్లి, తన ప్రభుత్వం కూలి పోయినప్పుడు తన కష్టాలను ప్రజలు తమ కష్టాలుగా భావించి హైదరాబాద్‌కు తమ ఖర్చులతో వచ్చి అసెంబ్లీని ముట్టడించ మన్నారు. కాని ఇటీవల రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో అధిక వర్షాలకు ప్రజలు భారీగా నష్టపోయారు. హైదరాబాద్ శివార్లలోనే ఎన్నడూ ఊహించ లేనంతగా ఇళ్లలోకి నీళ్లు వచ్చి పలువురు నిరాశ్రయు లయ్యారు. కాని హైదరాబాద్‌లోనే వుండి కనీసం మాట వరుసకైనా వారిని పరామర్శించ లేదాయన. నా కష్టాలూ, మీవే - మీ కష్టాలు మీవే అని వురుకొన్న ఎన్టీఆర్ అసలు రూపం ప్రజలు గ్రహించాలి.

కొవ్వూరు -జి.శేషగిరిరావు

## కటుకథలు

(4 పేజీ తరువాయి)

తర్వాతనూ ఉన్నాయి. ఆధునికులలో స్త్రీల వ్యథలను పట్టించుకొని కథలల్లిన - అల్లుతున్న - ఒకనాటి చలం నుండి నేటి వోల్గా వరకు - వీళ్లను కాస్త పక్కన బెడదాం. ఎందుకంటే - దృక్పథంలో వాళ్లకు జయప్రద గారికి తేడా ఉంది. వాళ్లు సమాజం మీద కసి పెంచుకొని, సంప్రదాయాలను సమూలంగా తెగ నరికి పారెయ్యాలి అనుకొనే వాళ్లు. జయప్రద గారి కథల్లో సంస్కరణాభిలాష కనపడుతూంది. అందువల్ల పోలిక వాళ్లతో పొసగదు. తాదృశ్యమైన ఉదాహరణ లివ్వడం సమంజసం.

"మేరీ మేగ్దిలిన్ - రూత్‌లు క్రీస్తు తరంలోని స్త్రీలు. బైబిల్‌లో వీళ్ల ప్రస్తావన ఉంది. అయితే వాళ్లవి వృత్తాంతాలు(Ancedotes) మాత్రమే; కథలు కావు. అయినా అవి చదువరుల ఎదను కదిలించి వేస్తాయి. కారణం - చెప్పిన తీరు.

రామాయణంలో అహల్య వృత్తాంతం - ఇదీ కథ కాదు. అయినా వాల్మీకి ఎంత పసందుగా చెప్పాడు? వాల్మీకి వాచ్యంగా ఏమీ చెప్పడు. తటస్థంగా ఉండి పోతాడు. అయినా పాఠకుల చేత గౌతముడిదే తప్పు అనిపిస్తాడు. వయసు చెల్లిన గౌతముడు, వయసులో ఉన్న పిల్ల పై మనసు పడి మనువాడటం తప్పు అనిపిస్తాడు. అహల్యను జారిణి అని పాఠకులు ఈసడించారు. Anecdotes లోనే ఇంత ప్రతిభ, ఇంత మెలకువ చూపించారు. మరి - పరిధిలోను, ప్రమేయంలోను కాస్త విస్తృతమైన కథలలో అటువంటి ప్రజ్ఞను కనబరచ వలసిన అవసరం లేదా? ప్రశ్నలు సంధించడం, బదుల్లు రాబట్టడం బడిపంతులు చెయ్య దగిన పని; కథా రచయితలకు అది తగని పని. ఎందుకంటే - కళ వాచ్యం కాదు - వ్యంగ్యం.

భాష విషయంలో కూడా రచయిత్రి శ్రద్ధ చూపించ లేదు. వాక్యాలు జల్లి పదాల అల్లికలు. భాషలో బిగువు లేదు; శైలిలో సొబగు కనరాదు. 'బడు' ధాతువు తెలుగు వాక్యాన్ని ఎంతగా భ్రష్టు పట్టిస్తుందో తెలుసు కోవాలంటే ఈ కథలు చదవాలి "శవం మోసుకొని పోబడు తూంది-" కర్త, కర్మ, క్రియాదులు చూసుకొంటే ఇది వాక్యమే. శవాన్ని మోసుక పోతున్నారు అంటే మేలు కాదా! ఆంగ్ల సంస్కృత భాషలలో ఇటువంటి కర్మణి ప్రయోగాలు ఉన్నాయి. కాని పై భాషల్లో కూడా కొన్ని పరిమితులున్నాయి; హద్దు పద్దులున్నాయి. చిత్తం వచ్చినట్లు ఆ భాషల్లో సైతం కర్మణి ప్రయోగాలు చెయ్యటానికి వీల్లేదు. విద్దూరం, వికారం అయిన ఈ "బడు" (దీని మూల రూపం "పడు") తెలుగు భాషకు కొందరు పట్టించిన తెగులు.

మొత్తం మీద - ఈ కథలు వృత్తి ప్రవృత్తుల నడుమ నలిగి నుజ్జవుతూ, అనుభూతికి, ఆలోచనకు సమయం చాలక - బలవంతాన - తీరికను కల్పించుకొని వ్రాసినట్లుగా కనబడు తున్నాయి. "నిలకడ వలయు కృతికి" అని అలంకారికుల సూక్తి. ఎడా పెడా రాసి మరుక్షణంలోనే అచ్చులో పేరు చూసుకొని మురిసి పోవాలను కొంటే గొప్ప కథలు కాదు గదా - కనీసం మంచి కథలైనా తయారు కావు.

జయప్రద గారికి మంచి ఊహాశక్తి ఉంది. కాని ఊహను వాస్తవి కరించడంలోనే తడబాటు కనబడుతూంది. కాస్త ఓపిక, మరి కాస్త తీరిక చేసుకొని పద ప్రయోగంలోను, వాక్య నిర్మాణంలోను శ్రద్ధ చూప గలిగితే మంచి కథలు రాయగలరన్న భరోసాను ఈ కథలు కల్పిస్తున్నాయి.

## రావణ కాష్టం

జయంపుకృష్ణ

స్వేచ్ఛకోసం యుద్ధం జరగాలా?
ప్రాణాలుఫణంగాసిద్ధాన్నంకావాలా?
మరి అహింసకు అర్థం ఏమిటి?
శాంతి సౌహార్ద్రాలకు పరమార్థం
ఏమిటి?
ఆయిల్, రక్తం ఆవహించాయి
పులులు, సింహాలు
పోరాడుతున్నాయి
మధ్యలో జింకలు మాడి
పోతున్నాయి
వధ్య శిల వాతబడి నేల
కరుస్తున్నాయి
చుట్టూ వున్నది సముద్రమా?
ఛిద్రమా?
అది ద్వీపమా? దెయ్యపు
రూపమా??
ఎన్నాళ్లు కాలాలీ రావణ కాష్టం?
ఎప్పుడు ఆరుతుందీ
అనంతకష్టం??
శవాలు ముక్కలై
పడుతున్నాయక్కడ
తలలు శిలల్లా ఘనీభ
విస్తున్నాయక్కడ
శాంతికీ, సమరానికి సేతువు
ఎక్కడ?
స్వేచ్ఛకూ, సమతకు హేతువు
ఎక్కడ??
ఎన్నాళ్లు సాగాలీ ఘోరనరమేధం?
ఎప్పుడు చిగురిస్తుంది శాంతి
సమవేదం??

## స్వర్ణలక్ష్మి

2 పేజీ తరువాయి

శాతం కమీషన్ లెక్కన 10 లక్షలు; ప్రకటనలు, టివి ప్రచారం, ఆఫీసు తదితరాలకు ఏడెనిమిది లక్షలు ఖర్చు పెట్టాలి. అంటే కనీసం 40 వేల మంది అయినా డబ్బు కట్టనిదే వీరు బహుమతు లివ్వలేరన్న మాట. అంతకంటే ఎక్కువ మంది డిపాజిట్ చేస్తేనే నిర్వాహకులకు లాభం. అంతకంటే తక్కువ మంది డబ్బు కడితే బోర్డు త్రిప్పడం తప్ప వీరు చేయగల్గింది ఏదీ లేదు. లాటరీ ఎత్తకుంటే జనం చేయగలిగింది ఏదీ లేదు. కట్టింది కేవలం వంద రూపాయలు కాబట్టి, దాన్ని రాబట్టు కోవడానికి వినియోగదారుల కన్స్యూమర్ ఫోరాల వంటి వాటిని ఆశ్రయించ లేరు. ... వెళ్లి అడిగే ఓపికా వుండదు. అందువల్ల జనం కట్టినంత మేరా వారికి ఆదాయమే. అందువల్ల నిర్వాహకులకు లాటరీ తీసినా లాభమే; తీయక పోయినా లాభమే.

అసలిటువంటి పథకాలు నిర్వహించడానికి ఎవరు అనుమతి మంజూరు చేశారు. కంపెనీ ప్రమోటర్లు ఎవరో తెల్పకుండా ప్రచారం, ప్రకటనలు చేయడం సరైన పనేనా? నిర్వాహకుల పద్ధేశ్యం మంచిదైనా, చెడ్డదైనా మోసానికి, దగాకు ఆస్కారం కల్గిన ఈ పథకాలను ప్రోత్సహించడం మంచిది కాదు. వీటి జోలికి పోకుండా వుండడం వుత్తమం.

### 30 శాతం అదనంగా ఆదాయం పన్ను

ఈ ఏడాది మొదటి ఆరు నెలల్లో ఆదాయం పన్ను వసూళ్లు ప్రోత్సాహ కరంగా వున్నాయి. దేశ వ్యాప్తంగా సెప్టెంబరు ఆఖరుకు గత సంవత్సరం కంటే 30 శాతం అదనపు వసూళ్లు జరిగినట్లు అంచనా. ఇదే ప్రకారం అభివృద్ధి వుంటే, మార్చి నాటికి నిర్ణయించిన 29 వేల కోట్ల లక్ష్యం అధిగమించి కనీసం 3 వేల కోట్లు అదనంగా దండే అవకాశం లభిస్తుంది. ఆర్థిక రంగం ఈ రోజు ఎదుర్కొంటున్న సంక్షోభంలో ఈ అదనపు వసూళ్లు ఒక్కటే చెప్పుకో దగిన విషయం.

### డాలర్‌ధర రు. 40 లవుతుంది!

అమెరికన్ డాలర్ ధర రూ. 34.50 పైసల దగ్గర నిలకడగా నిల్చి వుంది. అయితే ఈ నిలకడ తాత్కాలికమేనని, 1996 జనవరి నాటికి డాలర్ ధర రూ. 40 లకు పెరగడం ఖాయమని చెప్తున్నారు.



### పులివెందుల మున్సిఫ్ కోర్టులో

E.P. 217/89 : O.S. 137/76

గంగిరెడ్డి నారాయణరెడ్డి చనిపోయి నందున ఇతని వారసులు గంగిరెడ్డి రామిరెడ్డి మరియు ఇతరులు

-డి.హెచ్.ఆర్.

వెన్నపూస నారాయణరెడ్డి
చనిపోయిన.
R2 - వెన్న...
D/o. లేట్ నారాయణరెడ్డి
R3 - వెన్నపూస చంద్రకాంతమ్మ
D/o. లేట్ నారా...
R4 - వెన్నపూస చెన్నకృష్ణ...
S/o. లేట్ నారాయణరెడ్డి
R5 - వెన్నపూస వెంకటమ్మ.
W/o. లేట్ నారాయణరెడ్డి

వీరందరూ వెలిదండ్ల గ్రామ వాస్తవ్యులు లింగాల మండలి

పై కోర్టులో పై రెస్పాండెంట్లకు Sale Noticeకు గాను వాయిదా 29.11.95 తేదిన ఉన్నది. E.P. షెడ్యూలు ఆస్తి Sale Noticeకు ఆక్షేపణలున్న తెలుపు కొనవచ్చును.

జి. ప్రభాకరశాస్త్రి
అడ్వకేటు, పులివెందుల

## రియల్ ఎస్టేట్లు

(మొదటి పేజీ తరువాయి)

బహుమతులు పెట్టి సినిమా తారలతో సభలు పెట్టి, అరచేతిలో స్వర్గం చూపించి, జనాన్ని వెర్రి వాళ్ళను చేశాయి. ఆ ప్రచారార్భాటం చూసి ప్రజలు ఆ కంపెనీల ఆఫీసుల పైకి ఎగబడ్డారు. జనంలో మోజు పెరిగే కొద్ది దగాకోరు కంపెనీలు పుట్టుకొచ్చాయి. ఎందుకూ పనికి రాని దండగ మారి స్థలాన్ని కొందరు బంగారు గనిగా నమ్మపెట్టి అమ్ముకొంటే; అసలే స్థలమూ ... వేసి బోర్డులు తగిలించి ... కొందరు బురిడీ కొట్టారు. ప్రభుత్వ



స్థలాలు, శివాయిజు, పూరి పోరంబోకులు, అటవీ భూములు, పాడుపడిన చెరువులు తదితరాలన్నీ ఇళ్ల స్థలాల క్రింద చూపబడ్డాయి. ఈ దగాకోరు వ్యాపారంలో ఎవరెంత దోచుకున్నారు, ఎన్నెన్ని వందల మంది మునిగి పోయారు అని విచారించి చూసుకొంటె గుండెలు బేజారెత్తి పోతాయి. ఒక్కొక్క కంపెనీ చరిత్ర

చూస్తే కళ్లు తిరిగి వాస్తవాలు బయట పడతాయి. కొత్తవి, పాతవి కలిసి దాదాపు ఇరవై రియల్ ఎస్టేట్ కంపెనీలు నెల్లూరులో వుంటే అందులో ముప్పాతిక భాగం పౌరుల నెత్తిన కుచ్చుల టోపి పెట్టి పోతున్నాయన్నది వాస్తవం.

ఈ మోసంలో అగ్ర తాంబూలం రఘువీర్, మహావీర్ రియల్ ఎస్టేట్స్‌ది. నేషనల్ హైవే ప్రక్కన, టౌన్ దక్షిణ శివార్లలో ఘనమైన బోర్డులు తగిలించి, సర్వే రాళ్లు పాతి, దారినపోయే వారి కళ్లకు మిరుమిట్లు కమ్మేటట్లు అలంకరణలు చేయడంతో ఈ రెండు రియల్ ఎస్టేట్లకూ ఆ రోజుల్లో విశేష ఆదరణ లభించింది. వారి ఆఫీసులు, వాటి హంగామా, కార్లు, ... దర్పాలు చూసి అందరూ భ్రమసి పోయారు. 66 నెలలు పూర్తిగా

వాయిదాల ప్రకారం డబ్బు కట్టారు. ఇప్పటికా స్థలం రిజిష్టర్ చేయించు కోవలసిన సమయం వచ్చింది. కాని ప్రధాన ప్రమోటరు శ్రీ ఆనంద కుమార్ అంతు లేకుండా వెళ్లి పోయారని అలవాటిగా వుంది. ఆయన నెల్లూరులోనే వుండడం లేదట. అడిగే వారికి సమాధానం చెప్పే వారు లేరు. అమ్మిన ప్లాట్లకు తగినంత స్థలం లేదు. ఇప్పుడు పొలంకొని ఇవ్వడం అసాధ్యం. గట్టిగా దబాయించే వారికి ఏదో మొట్టచెప్పి పంపేస్తున్నారట. ఈ ప్రమోటర్ల

గ్రూపుకు నెల్లూరులోని పలు రియల్ ఎస్టేట్లతో సంబంధా లున్నాయి. మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు నగరాలలోనూ ఇటువంటి పథకాలు ప్రారంభించారు. పార్థ గ్రూప్‌గా పెద్ద ప్రచారం జరిగింది. మెగా రియల్ ఎస్టేట్‌గా పత్రికలలో పెద్ద పెద్ద ప్రకటన లిచ్చారు. ఆ నగరాలలోనూ ఇదే మోసం జరిగినట్లుంది. ఒక్క మద్రాసు నగరంలోనే వీరి పై కన్స్యూమర్ కోర్టులో దాదాపు 250 కేసులు దాఖలై వున్నాయట. దాన్ని బట్టే పరిస్థితి తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. వీరికి సంబంధించిన సమాచారం సేకరించ డానికి ప్రయత్నిస్తె, సంబంధితు లెవరూ అందుబాటులో లేరు.

వాయిదాలు కట్టిన వారి నుంచి వత్తిడి ఎదురయ్యే సరికి వీరు సిపిఎం పార్టీ రక్షణ కోరినట్లున్నారు. భాగస్తుల మధ్య పేచీల పరిష్కారం పేరుతో అందరూ అక్కడ ఆశ్రయం పొందుతున్నారు. సిపిఎం నాయకులు కూడా భాగస్వామ్య తగాదాలు తీర్చడానికి ప్రయత్నిస్తున్నారే కాని, వీరి దగాకు బలైపోయిన మధ్య తరగతి కుటుంబీకులకు కొంతైనా న్యాయం చేస్తామని ఆలోచించడం లేదు.

ముత్తుకూరు రోడ్డులో పార్థసారథి రియల్ ఎస్టేట్ అనే కంపెనీ ఒకటి ప్లాట్లు వేసింది. కంపెనీ తొలుత చేసిన ప్రచారం ప్రకారం 250 ఎకరాలకు పైన స్థలం వుండి వుండాలి వీరికి. కాని కంపెనీ పేరుతో పక్కాగా రిజిష్టరయిన పొలం విస్తీర్ణం పాతిక ఎకరాలకు మించదు. కంపెనీ లెక్క ప్రకారమే 1300 మంది సభ్యులు ఇప్పటికీ రెగ్యులర్‌గా వాయిదాలు కడ్తున్నారు. తమకు 150 ఎకరాల వరకు అగ్రిమెంట్‌లు వున్నాయని, అందువల్ల ఇబ్బంది లేదని నిర్వాహకులు చెప్తున్నారు. కాని వారు తగిలించిన బోర్డు ప్రక్కనే రైతులు నార్లు వేసుకొంటున్నారు. ఆ పొలం వారి స్వాధీనంలో వుండి వుంటే అక్కడ సర్వే రాళ్లు, రోడ్లు కన్పడాలి కాని, పైరు వుండడం మేమిటి? రోడ్డుకు ఆనుకొని వున్న పొలానికి ఆ రైతులు ఎకరా ఆరున్నర లక్షల ధర చెప్తున్నారని; అది భరించలేక కంపెనీ దిక్కు తోచకుండా నిలబడి పోయి వుందని తెలుస్తోంది. తక్కిన అగ్రిమెంట్లకూ కాలదోషం పట్టినట్లు వుంది. ఇప్పుడా రైతులు తమ పొలాలు ఈ కంపెనీకే విక్రయిస్తారన్న గ్యారంటీ ఏమిటి? తమ దగ్గర పొలం స్వాధీనంలో వున్నట్లు చూపించడానికి వీరి దగ్గర డాక్యు...ప వున్నట్లు లేదు. 1992 లో మొదలైంది ఈ కంపెనీ. 1998 లో రిజిష్ట్రేషన్ కాబట్టి పొలం అప్పుడు కొనుక్కోవచ్చు ననుకున్నట్లుంది. అప్పటికి రాజెవరు? మంత్రెవరు? ఇందులో డబ్బు కట్టిన సభ్యులకు ఏ మాత్రం గ్యారంటీ లేదు.

అమాయక జనం కట్టిన డబ్బు గాలిలో దీపం చందంగా, నమ్మకమన్నది బొత్తిగా కన్పించని మరొక కంపెనీ అపోలో రియల్ ఎస్టేట్. ఇందులో 1500 మంది సభ్యులు చేరారు. వెయ్యి మంది మాత్రమే క్రమం తప్పకుండా వాయిదాలు కడ్తున్నారట. కేవలం 150 మందికి స్థలం రిజిష్టర్ చేశారు. వంద ఎకరాల వరకు తమకు అగ్రిమెంట్ వుందని వీరు చెప్తున్నారు. 1992 లో మొదలై, 1999 లో పూర్తయ్యే పథకం ఇది. అప్పటి వరకు అగ్రిమెంట్లు నిలుస్తాయా? రైతులు ఆ పాత రేట్లకు తమ పొలాలు వీరికి స్వాధీనం చేస్తారా? ఈ రియల్ ఎస్టేట్‌కు డిటిపి అప్రూవల్ వంటివేవీ లేవు. ఆ మధ్య కంపెనీ ఒక చిన్న షెడ్డు వేయబోతే మునిసిపల్ అధికారులు వచ్చి పడగొట్టారు. రేపు ఇళ్లు కట్టినా అదే పరిస్థితి కాదా? డిటిపి అప్రూవల్‌కు సంబంధించి అన్ని కంపెనీలూ జనాన్ని మోసం చేశాయి. ఒక్క నిర్మల రియల్ ఎస్టేట్ తప్ప మరెవ్వరికీ అనుమతి లేదు.

ముత్తుకూరు రోడ్డులోనే షిర్డీ సాయి రియల్ ఎస్టేట్ అని మరొకటి వుంది. అది మరీ గోల్మాల్ వ్యవహారం వలె వుంది. వారి పేరుతో పదెకరాలు కూడా రిజిష్టరయిన దాఖలాలు లేవు. ఇప్పుడక్కడ భూమి ధర చాలా పెరిగి పోయివుంది. కొని, సభ్యుల కివ్వడం అసాధ్యం.

ద్వారకామాయి అని మరొక రియల్ ఎస్టేట్. 91లో మొదలు పెట్టారు. 1500 మంది పైన సభ్యులు చేరారు. వెయ్యి మంది వరకు మిగిలారు. కేవలం వంద మందికి రిజిష్టర్ చేశారు. తక్కిన వారికి కూడా ఇబ్బంది లేదని కంపెనీ నిర్వాహకులు భరోసా ఇస్తున్నారు. కాని, స్థలం కొని రిజిష్టర్ చేసిన దాఖలాలు లేవు బైపాస్ రోడ్డు క్రింద పోయే భూమిలో కూడా ప్లాట్లు చేసి అమ్మారన్న ఆరోపణ వుంది. అవసరమైన పొలం ఎప్పుడు కొంటారో, ఎప్పుడు స్వాధీనంలోకి తెచ్చుకొని, రోడ్లు గిడ్లు వేస్తారో పరమాత్ముడి కెరుక!

అక్కడే ఆదిత్య రియల్ ఎస్టేట్; వీరు మాత్రం తమ కవసరమైన 90 ఎకరాల భూమిలో 85 ఎకరాల వరకు రిజిష్టర్ పత్రాల ద్వారా స్వాధీనం చేసుకొని వున్నామని చెప్తున్నారు. సభ్యుల సంఖ్య 300 అట. ఫిబ్రవరిలోగా అందరికీ స్థలాలు స్వాధీనం చేసేందుకు రెడీ అంటున్నారు.

ఇంతే ధైర్యంగా పొలం స్వాధీనం విషయంలో సభ్యులకు భరోసా ఇస్తున్న మరొక కంపెనీ నిర్మల రియల్ ఎస్టేట్. వీరు పూర్తిగా పొలం కొని పథకం ప్రారంభించారట. అందువల్లే డిటిపి అప్రూవల్ తెచ్చుకో గలిగారు. తమ దగ్గరుండే సభ్యుల కంటే, పొలం ఎక్కువుందని చెప్తున్నారు.

కోవూరు పాలిటెక్నిక్ దగ్గర షిర్డీ సాయి రియల్ ఎస్టేట్ ఒకటి వుంది. వారూ తాము భూమి పూర్తిగా కొనుగోలు చేశామని చెప్తున్నారు. కాని డాక్యుమెంటు వున్నాయో లేవో తెలియదు. 800 మంది సభ్యులు మిగిలి వున్నారట. 55 ఎకరాల భూమి వుందంటున్నారు. తక్కిన దాని సంగతి? ఎప్పుడు కావాలన్నా రిజిష్ట్రేషన్‌కు రెడీ అంటున్నారు.

విచారించు కొంటూ వెళ్తె ఒక్కొక్క రియల్ ఎస్టేట్‌లో ఒక్కొక్క సమస్య, ఒక్కొక్క మోసం, ఒక్కొక్క దగా బయట పడేట్లున్నాయి. చెప్పిన ప్రకారం అన్ని వసతులూ కల్పించి, అందరు సభ్యులకు నికరంగా స్థలం స్వాధీనం చేసే కంపెనీలను వ్రేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. గ్రామ పంచాయితీల లేఔట్లతో స్థలాలు మార్క్ చేయడం వల్ల వీరి పై మునిసి పాలిటీకి అదుపు వున్నట్లు లేదు.

మరికొన్ని వివరాలు పై వారం చర్చించు కొందాం.

## డాక్టరైన వేళ-

ఆకాశ కుసుమమ్ము అరచేతిలోవాలి
దేవ రహస్యముల్ తెలిపినట్లు..
సుందర స్వప్నమ్ము సురుచిరాకారమ్ము
దాలిచి తట్టి మేల్కొలిపినట్లు..
చిననాటి కోరిక శ్వేతాశ్వమై వచ్చి
సకిలింత లిదముందు సలిపినట్లు..
దోటకందని ద్రాక్షనోటిముంగిట దూకి
నిలువెల్ల తీపితో నింపినట్లు..
ప్రాథమిక విద్యనైననుబడయనట్టి
నన్ను వరియించె డాక్టరేటన్నవార్త
నరసినంతనె మును వెన్నుతెరుగనట్టి
అతులితానందమేదోనన్నావహించె

మొదుబారిన సిరిమల్లెమొగ్గ తొడిగి
పరిమళమ్ము ను నల్దెసల్ పరచినపుడు
తోటమాలికి కలుగుకౌతుకమువంటి
సంబరమునిండెనపుడు నా స్వాంతమందు

దేశమందున లబ్ధ ప్రతిష్ఠులైన
మేటి వ్యక్తుల సరసన పీట వేసి
ఆదరించిన విశ్వవిద్యాలయమ్ము
రుణము తీర్పగయత్నింతు ననుదినమ్ము

ఎక్కడో మారుమూల జనియించిన నిత్య కృషీవలుండ, నా పక్కన చేర మోజుపడి వచ్చినదీ బిరుదమ్ము, కాన, నే నక్కునచేర్చుకొంటి! ఇహ అక్షర శిల్పము లొక్కటొక్క శే చెక్కద నెల్ల వారరసి చెక్కిలి ముద్దిడిమెచ్చునట్లుగా

డాక్టర్ మల్లెమాల



జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

...ited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.